*Issued—December 1955.*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

### OFFICIAL REPORT

### TUESDAY, THE 26th APRIL 1955

### VOLUME I—No. 4

*CONTENTS*

PAGES

DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS :—

MOTION OF THANKS (contd.) 121-180

THE ROYAL PRINTING WORKS,
MADRAS-2.

FOR THE SUPERINTENDENT, ANDHRA GOVERNMENT PRESS,
KURNOOL.

1955

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

—o—

**TUESDAY, 26th APRIL, 1955**

—o—

The House met in the Legislative Assembly Chamber, Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

Mr. SPEAKER:—The first item in the agenda is the question hour. As the seating arrangement is not ready, I feel there will be difficulty in hon. Members putting supplementary questions. So in consultation with the Leaders of parties, I am putting off the question hour to tomorrow.

## I. DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS.

Sri N. P. Chengalraya Naidu:—అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగములో మన ఆంధ్రదేశములో అనేక అభివృద్ధికరమైన పనులు చేస్తామని చెప్పబడియున్నది. అందుకు నేను గవర్నరు గారిని అభినందిస్తున్నాను. అందులో ముఖ్యంగా నందికొండ ప్రాజెక్టు విషయములో పనులు ప్రారంభించటానికి అప్పుడే పూనుకున్నామనిన్నీ అక్కడికి రహదారి సౌకర్యాలకుకూడా ఏర్పాట్లు జరుగుచున్న వనిన్నీ చెప్పారు. ఈ విషయములో ప్రభుత్వాన్నిగూడా అభినందించవలసి యున్నది.

ఇంకను ఈ నందికొండతోపాటు, తుంగభద్ర ఎగువకాలవకూడా శీఘ్రంగా ప్రారంభిస్తా మని హామీ యిచ్చినందుకుకూడ నా అభినందనలు తెలుపుతున్నాను. మొట్టమొదట గవర్నరుగారి ప్రసంగములో ఎన్నికలు సక్రమంగా జరిపినట్లు చెప్పారు. కాని మన కమ్యూనిస్టుపార్టీ నాయకులు ఎన్నికలు సక్రమంగా జరగలేదని చెప్పారు. సుందరయ్యగారు ఆ విధంగా చెబుతున్నారంటే దానికి కారణములున్నవని అనుకుంటాను. వారు తమ ఎన్నికల ప్రచారంలో, వారు ప్రధానమంత్రి అవుతా ననిన్నీ ప్రధానమంత్రికావడానికే ఈ ఎన్నికలలో నిలబడ్డానని ప్రచారముచేశారు. ప్రధానమంత్రి కాదగిన యిట్టువంటివారు ఈ సభలో పార్టీలీడరుగాగాని, ప్రతిపక్ష లీడరుగాగాని గుర్తింపుకుకూడా లేకుండా పోయారు. వారు పార్టీలీడరు కావడానికి తగినంతమంది సభ్యులు ఎన్నికలలో గెలవకపోయినందున, అందుచేత తమ పార్టీకి బలము చేకూరనందున, వారి విచారమునకు సూచనగా యీనాటి ఎన్నికలు సక్రమంగా జరగలేదని చెబుతున్నారని తేలుతున్నది. కాని అధికసంఖ్యాకులుగా వున్న సభ్యులందరు ఎన్నికల విషయము ఎవరుగూడా ఏ విధంగానూ చెప్పనవసరములేదని అనుకుంటాను. మన రాష్ట్రంలో కాంగ్రెసు సభ్యులే అధికంగా ఎన్నికకావటానికి కారణములున్నవి. గత 13 మాసాలపాటు ప్రకాశం పంతులుగారి ప్రభుత్వంలో చేసిన పనులు ఎంతో ఉత్సాహముతో చేయబడినవి. అటువంటి ప్రజలు

(Sri N. P. Chengalraya Naidu) [26th April, 1955

చూడగలిగారు. కమ్యూనిస్టు పార్టీవారి వాగ్దానాలవలెగాక, కాంగ్రెసు పార్టీవారు వాగ్దానాలుచేసి పనులు సాధించినందులకు ప్రజలు ఎంతో హర్షిస్తున్నారు. ఈనాడు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు పార్టీవారే ఎక్కువమంది గెలిచినారంటె అందుకుకారణం ప్రకాశం ప్రభుత్వమే గనుక, ఆ ప్రభుత్వానికి నా ధన్య వాదాలను అర్పించుచున్నాను. ఇప్పుడు మరల కాంగ్రెసుప్రభుత్వము ఏర్పడింది. ఇందులో గోపాలరెడ్డి గారు నాయకత్వం వహించి, ప్రధానమంత్రిగా వచ్చారు. వారు మంత్రివర్గము ఏర్పాటుచేసిన తర్వాత, వారుచెప్పిన విషయాలు చాలామంచివిగా వున్నవి. ముఖ్యంగా ప్రాజెక్టుల విషయములో చేయబోయే పను లను గురించి వారు చెప్పారు. ప్రకాశంగారి హయాములో వారి మంత్రివర్గము ఎంత ఉత్సాహకరంగా పనులు చేశారో, యిప్పుడు గోపాలరెడ్డిగారి హయాములో వీరి మంత్రివర్గముకూడా అదేమాదిరి ఉత్సాహ కరంగా పనులు చేస్తారని ప్రజలు ఆశిస్తున్నారు. ఇక రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేలోగా అన్నిజిల్లాలలోనూ కమ్యూనిటీ ప్రాజెక్టులు, National Extension Schemes న్నూ ఏర్పాటు చేస్తామని చెప్పారు. అవి సాధ్యమయినంత త్వరలో ప్రవేశపెడితే బాగుంటుందని అంటున్నాను. ఈ సంవత్సరముగూడా మనకు కొన్ని National Extension Schemes రానున్నవి. మనకు తరిఫీదు అయిన ఉద్యోగస్థులు లేరని తెలియడమువల్ల కేంద్రప్రభుత్వమువారు ఈ National Extension Schemes యివ్వలేదని తెలుస్తున్నది. అందువల్ల ప్రభుత్వమువారు తగినంతమంది ఉద్యోగస్థులను తరిఫీదుచేసి, ఈ National Extension Schemes ను చాలమటుకు అమలులో పెట్టటానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

గవర్నరుగారు electricity విషయం చెప్పారు. కొన్నిగ్రామాలలో యీ విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు. మనము ముందు మద్రాసు రాష్ట్రములో వుండగా విద్యుచ్ఛక్తి అనేది గ్రామా లకు బొత్తుగా సరఫరాకాలేదు. అటువంటిది, మనకు ప్రత్యేకరాష్ట్రము వచ్చి, మన ప్రభుత్వం క్రింద శ్రీ సంజీవరెడ్డిగారి ధర్మమా, అంటూ, గ్రామాలకు గూడా విద్యుచ్ఛక్తి సరఫరా చేయించినందులకు వారిని నేను ముఖ్యంగా అభినందించవలసి యున్నది. వెనుకటి ప్రభుత్వములో వారు ఉపముఖ్య మంత్రిగా వున్నారు. ఈ ప్రభుత్వములోగూడా వారు మరల ఉపముఖ్యమంత్రిగా రావడము మన అదృష్టమేనని అంటాను. ఇంకను మిగిలిపోయిన అన్ని గ్రామాలలోగూడా విద్యుచ్ఛక్తి సరఫరా అయ్యే టట్టు చూస్తారని ఆశిస్తున్నారు. ముఖ్యంగా కరువుతో బాధపడుతూవున్న ప్రాంతాలు చాలామటుకు వెనుకబడి యుంటున్నవి. కనుక ఈ విద్యుచ్ఛక్తి సరఫరా జరిగేటప్పుడు, ఆ ప్రాంతాలన్నియు ప్రభు త్వమువారు దృష్టిలోవుంచుకొని, ఆ ప్రాంతాలనే త్వరగా ముందుకు తీసుకురావడానికి ప్రయత్నించవలసి కోరుతున్నాను. ప్రభుత్వపరిపాలన గవర్నరుగారి చేతులలో వున్నప్పుడు electricity సరఫరాకు రేట్లు విషయములో ఎన్నోమార్పులు చేశారు. ఈరేట్ల మార్పువిషయములో మాకు ఏయిబ్బందికూడా లేదు. కాని కొన్నిచోట్ల ఒకరేటు మరి కొన్నిచోట్ల యింకొకరేటు వుండకుండా, అన్నిచోట్ల ఒకేరేటు వుండాలని నాఅభిప్రాయము. అయితే వ్యవసాయానికి సంబంధించినంతవరకు electricity రేట్లు పెంచడమనేది, రైతులకు చాలా కష్టంగా ఉంటుంది. ఈవిధంగా రేట్లు పెంచినందువల్ల, రైతులు కష్టాలకు గురిఅవుతున్నారు. ధాన్యం ధరగూడ పడిపోయిన కారణంచేత వ్యవసాయంలో అయ్యేఖర్చులకు కూడ సరిపోని కారణంచేత వారికష్టాలు యింతఅనిచెప్ప వీలులేకుండావున్నది. ఇటువంటి కష్టసమయ ములో, వ్యవసాయపు ఖర్చులతోనే తాళలేకుండావుంటే, యింకను ఈ electricity ఖర్చులుగూడా పెత్తిపడితే, రైతులయిబ్బందులు ప్రభుత్వమే ఎక్కువ చేసినవారవుతారని హెచ్చరిస్తున్నాను. హెచ్చు

26th April, 1955] (Sri N. P. Chengalraya Naidu)

చేసిన electricity rates ను అపుజేస్తూ, మరల ఒక కనీసపురేటును నిర్ణయించేవరకూ, పాతరేట్లనే అమలులో వుంచవలసిందిగా కోరుతున్నాను.

తరువాత విద్యవిషయము గురించి గవర్నరుగారు తమ ప్రసంగములో ఒకవెయ్యి ప్రాథమిక పాఠశాలలను ఏర్పాటుచేశామని చెప్పారు. కాని ఈ వెయ్యిపాఠశాలలు చాలవు. ఇవి యింకను అధికము చేయాలని అంటున్నాను. Secondary education విషయములో క్రొత్త courses పెడుతున్నామని అన్నారు. మంచి విషయమే. ఈ ప్రభుత్వము వచ్చినతరువాత పత్రికలలో కొన్నివార్తలు చూచాము. వాటిని గురించి ప్రజలలో కొంత ఆందోళన బయలుదేరినది.

అక్కడక్కడ కొన్ని హైస్కూల్సును కూడా తీసివేయడానికి, ప్రభుత్వం పూనుకుంది. విద్యాభివృద్ధికి మనం అధికంగా పాఠశాలలు ఏర్పరచవలసిన పరిస్థితులలో, వున్నవాటిని తీసివేయడం బాగులేదని ఆవుత్తరువులను రద్దుచేయవలసినదని మంత్రి వర్గానికి మనవిచేసుకుంటున్నాను.

శ్రీ గోపాలరెడ్డిగారి మంత్రివర్గం యిక్కడ ఏర్పాటై అట్టే రోజులుకాలేదు. వారు యోచించుకొని యింకా కొన్ని అభివృద్ధికరమైన విషయాలు చెప్పేందుకు కాలం లేకుండా పోయింది. కొద్ది రోజులలో అన్ని విషయాలు యోచించుకొని అభివృద్ధికరమైనపనులు ఎక్కువగా చేస్తారని ఆశించవచ్చు.

ముఖ్యంగా గ్రామాలలో త్రాగేనీటి సౌకర్యంలేకుండా ప్రజలు యిబ్బంది పడుతున్నారు. అటువంటి గ్రామాలలో త్రాగేనీటి సౌకర్యంకూడా ఏర్పాటు చేయవలసినదని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఈనాముల విషయంలో Estate Land Act ను సవరించి Supreme Court వారుగాని High Court వారుగాని యిచ్చిన తీర్పులకులోబడి యినాములను రద్దుచేస్తే మనం ప్రజలకు ఎక్కువ సౌకర్యం చేయవచ్చునని నేను ప్రభుత్వానికి మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

*Sri M. Nagi Reddi :—అధ్యక్షా, గవర్నరుగారి భాషణపై రాజేశ్వరరావుగారు ప్రతిపాదించి నటువంటి తీర్మానాన్ని నేను బలపరచజాలనందుకు విచారిస్తున్నాను. ఇప్పుడు ఈ భాషణపై చెప్పబోయే ముందు రాజేశ్వరరావుగారు, తదితరులు కొంతమంది ఎన్నికలు చాలక్రమంగా జరిగాయని చెప్పేసి, ఏదయినా దుష్ప్రచారం జరిగిఉంటే అది కమ్యూనిస్టుల వైపునుంచే జరిగిందని వారు చెప్పారు. అది వాస్తవానికి విరుద్ధమైనదని చెప్పాల్సి వుంటుంది. ఎన్నికల కోలాహలం ప్రారంభించినప్పటికే అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ దేబర్ భారత దేశానికి ప్రధానమంత్రి శ్రీ జవహర్లాల్ నెహ్రూ మొదలు గ్రామాల్లోవున్నటువంటి చిన్న చిన్న నాయకులవరకు కమ్యూనిస్టులు అధికారంలోకి రావడంఅంటే మరల ఎన్నికలుండవని దుష్ప్రచారం చేశారు. కమ్యూనిస్టులు అధికారంలోకి వస్తే దేవుని పూజించనివ్వరనీ, 50 ఏండ్లపైబడ్డ ముసలివారిని గొంతుకులిమేస్తారనీ, యింకా అనేకమైన వీచ్రవచారం చేసిన సభ్యులు యిక్కడ అనేక మంది వున్నారు. నా నియోజకవర్గంలోని కాళంపూడి గ్రామానికి శ్రీమతి అమ్మన్నరాజాగారు, బ్రహ్మానంద రెడ్డిగారు వచ్చి 'కమ్యూనిస్టులు అధికారంలోకివస్తే భార్యా, సంసారం వుండనివ్వ'రని ప్రచారంచేశారు.

MR. SPEAKER:—Order. order, the election propaganda is not quite relevant to the discussion before the House.

Sri M. Nagi Reddi —ఈవిధంగా దుష్ప్రచారం చేసినవారు యిప్పుడు తామేమీ చేయ లేదనడం ఆత్మవంచన చేసుకోడం తప్ప మరొకటికాదని మనవి చేస్తున్నాను. "దేశంలో ప్రజలు 1937–47 సంవత్సరాలలో కాంగ్రెసుకు ఏవిధంగా అఖండమైన విజయం చేకూర్చారో ఇప్పుడుకూడా అదేమాదిరిగా అఖండవిజయం చేకూర్చారు" అంటున్నారు. కాని యివ్వాళ నిజంగా ఒకసారి చూచి నట్లయితే 1937–47 సంవత్సరాల కాంగ్రెసు యిదేనా అనిపిస్తుంది. ఈనాడు జాగీర్దార్లు, భూస్వాములు, పెద్దపెద్ద పెట్టుబడిదార్లతో కూడివున్నది కాంగ్రెసు. అసెంబ్లీలోని కాంగ్రెసు కూటమి చూచి నట్లయితే జమీందార్లు, జాగీరుదార్లు పెద్దభూస్వాములతోకూడ యున్నట్లు తెలుస్తున్నది.

MR. SPEAKER:—Let there be no personal aspersions.

Sri M. Nagi Reddi:—తత్ఫలితంగా ఈ నాడు మంత్రివర్గం భూస్వాములతో కూడి వటువంటిది. ఈ మంత్రివర్గం భూస్వాముల జమీందార్ల పెట్టుబడిదార్ల యోగక్షేమాన్నే చూస్తుంది, ఒకవైపు ఆవడి సోషలిజము స్థాపించుకున్నాం అని చెబుతూ.

Sri M. Rajeswara Rao:—Point of order, Sir. ఈ సభలో జమీందార్లు, జాగీరుదార్లు ఎవరూ లేరని మనవిచేస్తున్నాను.

Sri Pilalamarri Venkateswarlu:—What is your ruling Sir.

MR. SPEAKER:—There is not much particular point in it. Personal aspersions will have be avoided.

Sri M. Rajeswara Rao:—On a point of personal explanation, Sir.

MR. SPEAKER:—He is raising a point of order.

Sri Pillalamarri Venkateswarlu:—He is raising a point of personal explanation.

MR. SPEAKER:—Order, order, the hon. Member should avoid personal aspersions.

Sri Pillalamarri Venkateswarlu:—I would like you to clarify the position, Sir.

Sri R. B. Ramakrishna Raju:—May I submit, Sir, if any particular member wants to raise a point of order, he should do so only if he gets the permission of the Chair; then, the other member must necessarily sit down. I suppose it is your ruling.

26th April, 1955]

MR SPEAKER.—Yes.

Sri R. B. Ramakrishna Raju:—If that is your ruling, Sir, I would request you to strictly enforce it. I don't like three or four members standing simultaneously and speaking and shouting. I am sorry I have to say 'shouting'. And also when the Speaker is on his legs no member should be standing. I would be sorry to see if the prestige and dignity of the House is lowered by this kind of procedure.

MR. SPEAKER:—I expect Hon. Membe.s to follow the etiquette of the House.

Sri M. Nagi Reddi:—దాని పర్యవసానంగా ఈ రోజున గవర్నరు ప్రసంగంలో వచ్చినటువంటి విషయాలను చూచినట్లయితే ఒకవైపున ఆవడి సోషలిజము అంగీకరించామని చెప్పిన మిత్రులు ఈ భాషణలోవున్న విషయాలు తీసుకున్నట్లయితే ఏ ఒక్క సమస్యమీదకూడ ప్రజానీకానికి, వ్యవసాయ కూలీలకు ఉపయోగపడే విషయాలు లేవని స్పష్టంగా కనబడుతున్నది.

పందికొండ ప్రాజెక్టు నిర్మాణానికి కేంద్రప్రభుత్వము కొన్ని conditions పెట్టింది. వాటికి మేము అంగీకరిస్తామంటారు మన ప్రభుత్వమువారు. నందికొండ ప్రాజెక్టుక్రింద సాగయ్యే తాలూకాలు, గుంటూరుజిల్లాలోని పల్నాడు, ఒంగోలు, బాపట్ల, నెల్లూరుజిల్లాలోని దర్శి పొదిలి, కనిగిరి, ఆత్మకూరు, గూడూరు, కర్నూలు జిల్లాలోని కంభం, మార్కాపురం తాలూకాలు, ఈ ప్రాంతాలకు నీళ్లు కావాలని చెప్పుతూ (betterment tax) అభివృద్ధిపన్ను వేస్తామంటారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో వున్నపుడు ఈ పన్నును ఆపుచేయుటకు ప్రతిపక్షము తీవ్ర ఆందోళన సాగించినది. ఏమి జరిగింది? దానిని ఉపసంహరించుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. అభివృద్ధిచేయడమనే పేరుతో ఈ వేళ ఒక ఎకరానికి 40–50 రూపాయలు పన్నువేయడానికి సిద్ధముగావున్నట్లు స్పష్టముగా కనబడుతుంది. వెనుకబడిన తాలూకాలలోని ప్రజానీకము వాటికి కట్టలువేసి చదును చేసుకునేందుకు ఎకరానికి 4–5 వందల రూపాయలు ఖర్చుఅవుతుంది. ఈ పరిస్థితులలో ఇంక ఎకరానికి 50–60 రూపాయలు అభివృద్ధిపన్ను వేస్తామంటే దానికి అర్థములేదు. ఇదేనా మీ ఆవడి కాంగ్రెస్ తీర్మానము చెప్పేది? ఇదేనా మీసామ్యవాదమని అడుగుతున్నాను. బంజరుభూములను వేలము వేస్తామంటారు. బీదప్రజానీకము ధనవంతులతో పోటీచేసి ఎక్కువ వెలకు ఆభూములను కొనగలరా? ఇదేనా మీ socialism? బంజరుభూములను వేలమువేయకుండ బీదప్రజానీకానికి ఉచితంగా పంచాలని కోరుతున్నాను. ఫారెస్టు బంజర్ల విషయము గవర్నరుగారి ప్రసంగములో తీసికొనిరాలేదు. ఈ ఫారెస్టుబంజర్లను బీదలకు పంచిపెట్టాలని కోరుతున్నాను. ఇక 10 రూపాయలలోపు శిస్తును రద్దుచేయడానికి వీలులేదని స్పష్టంగా కనబడుతున్నది. Graded tax అమలు జరుపుతూ 10 రూపాయలలోపు శిస్తును రద్దుచేయాలని కోరుతున్నాను. జిల్లాబోర్డు ఎన్నికలు ఏదో కారణము చెప్పి పొడిగించుచున్నారు. ఈ జిల్లాబోర్డులకు మామూలుగా ఎన్నికలు జరిపించాలని కోరుతున్నాను. ఒకవైపు విద్యాభివృద్ధి చేయాలని చెప్పుతూ రెండవవైపున schools ను మూసి

(Sri M. Nagi Reddi) [26th April, 1955

వేస్తామంటున్నారు. దాచేపల్లిస్కూల్ మూసివేస్తున్నారని తెలిసింది. స్కూళ్లను అధికముచేయవలసిన రోజులలో వున్నవాటిని మూసివేయకుండా చర్యలు తీసుకుంటారని ఆశిస్తున్నాను.

Sri L. Lakshmana Das :—అధ్యక్షా, గవర్నర్‌గారి వుపన్యాసానికి తీసుకొచ్చిన అభినందన తీర్మానముతో నేను ఏకీభవిస్తున్నాను. ముఖ్యంగా ఈ నాడు ఈ ఎన్నికల సందర్భములో రాష్ట్రములో ఎన్నికలు ఎంతో నిష్పాక్షికముగా జరిగినవనేది అందరూకూడా అంగీకరించవలసియున్నది. కాని కమ్యూనిస్టులు అంగీకరించ లేకపోతున్నారు. వారు ఆంధ్రరాష్ట్రములో పరిపాలనచేస్తామని ఆశించివుండవచ్చును. ఆ ఆశ నెరవేరనందున వాండ్లకు బాధగావుండవచ్చును. ఎవరు దేశద్రోహులైంది ప్రజలు తీర్పునిచ్చారు. కనుక ఆంధ్ర ప్రజానీకమిచ్చిన తీర్పునకు కట్టుబడివుండమని కమ్యూనిస్టులకు హృదయపూర్వకముగా మనవిచేస్తున్నాను. ఎన్నికలలో భూస్వాములు రైతులను కమ్యూనిస్టులకు ఓటుచేయనియ్యలేదన్నారు. కాంగ్రెస్‌పక్షములో భూస్వాము లున్నారన్నారు. పాతపట్టణం తాలుకాలో మద్దాల అనేగ్రామములో ఒక పెద్ద భూస్వామి కమ్యూనిస్టుపార్టీకి ఓటుచేయలేదని 5 కుటుంబాలవారిని పనులుచేసుకోకుండ కట్టుదిట్టాలుచేసి వాండ్లను నీళ్లు తెచ్చుకోకుండా చేయడము జరిగింది. ఈ విషయము తెలిసికోవాలని వారిని కోరుతున్నాను. భూస్వాములు కాంగ్రెస్‌లో వున్నారనికాదు. దేశములో కాంగ్రెసు ప్రజాస్వామ్య సిద్ధాంతాలపైన ఒక ప్రణాళికను తయారుచేసింది. ఆ ప్రణాళికను ప్రజల ముందుపెట్టి వాండ్ల అంగీకారమును పొందినది. నాగిరెడ్డిగారు భూస్వామికాడా అని నేను అడుగుతున్నాను. మనము దేశాన్ని అభివృద్ధి చేసుకొనే తరుణములో రెండవ పంచవర్ష ప్రణాళికను అమలుజరిపే అదృష్టము ఈ శాసనసభకు ప్రాప్తించినది.

ఈనాడు మనం ఎన్నికల సందర్భంలో వచ్చిన కక్షలు పెరుగకుండా దేశాన్ని అభివృద్ధి చేసుకోవాలి. రెండవ పంచవర్షప్రణాళికను అమలు ఏవిధంగా జరగాలో ఆలోచించుకొని ప్రతిఒక్కరు శ్రద్ధగా పూనుకుంటే దేశం అభివృద్ధి అవుతుంది. సుందరయ్యాగారికి ఒక విషయంలో అభినందనాలు చెబుతున్నాను. ఆయన క్రిందటి అసెంబ్లీలో మాదిరిగా కాకుండా దేశ అభివృద్ధికి కావలసిన సూచనలు ఇచ్చినందుకు అభినందిస్తున్నాను. క్రిందటి అసెంబ్లీలో ఇటువంటి సూచనలు ఏమి రాలేదు. ఇప్పటికైనా సుందరయ్యగారు కాంగ్రెసు చేసే మంచికార్యాలకు సహకారం ఇస్తామని చెప్పడం మంచిది. అందుచేత కమ్యూనిస్టు పార్టీలో క్రొత్త దృక్పథం ప్రారంభమయినదని అనుకుంటున్నాను.

గవర్నరుగారి ఉపన్యాసంలో ప్రభుత్వంవారు చేయవలసిన కార్యక్రమాలు మన ముందుపెట్టారు. అంతమాత్రం చేత అదిలేదు, ఇదిలేదు అనుకోవడం చాలా పొరపాటు. ఇందులో చెప్పినవితప్ప మరొకటి ఏమిచేసేది లేదని ప్రభుత్వం చెప్పలేదు. ఆర్థికంగా దేశాన్ని ఏ విధంగా అభివృద్ధిచేయాలి అనేది దృష్టిలో పెట్టుకొని పంచవర్ష ప్రణాళికను తయారుచేశారు. దాని ఫలితం మనం ఈనాడు చూస్తున్నాము. వెయ్యికోట్ల రూపాయలు ఖర్చుపెట్టి ధాన్యం దిగుమతి చేసుకోవలసిన స్థితిలోవున్న మనం ఈనాడు మనకు సరిపోయే తిండిగింజలను ఉత్పత్తిచేయడమే కాకుండా, ఇతరదేశాలకుకూడా ఎగుమతిచేసే స్థితిలోవున్నాము. రెండవ పంచవర్ష ప్రణాళిక గ్రామాలకు సంబంధించినది. అందుచేత దీనిలో అభివృద్ధి కార్యక్రమాలుద్వారా దేశాన్ని ముందుకు తీసుకుపోవడం దృష్టిలో పెట్టుకోవాలని సభ్యులకు మనవిచేస్తున్నాను. శ్రీకాకుళం జిల్లాకు సంబంధించినంతవరకు నాకు కొంచెం విచార

కరంగా వున్నది. శ్రీకాకుళం జిల్లాకు పనికివచ్చేది వంశధార ప్రాజెక్టు ఒకటే. అనేకదినాలనుంచి వంశధార నీళ్లను సక్రమంగా వినియోగించుకుని జిల్లాను పాడిపంటలతో అభివృద్ధి చేయాలని మొదట నుంచి ఆందోళన చేస్తున్నాము. రిజర్వాయరు ఎక్కడ నిర్మించాలనే ఆందోళన బయలుదేరింది. వంశధార మహాసభ జరిగింది. గొట్ట, సింగడి, మదనాపురం అనే మూడుచోట్లలోను ఎక్కడ రిజర్వాయరు నిర్మించాలనే సందర్భంలో ఆ మహాసభకు తమరే అధ్యక్షత వహించారు. శ్రీ వి.వి. గిరిగారు అనేకమంది నాయకులు సమావేశమై తీర్మానం చేసినసంగతి తమకు తెలుసును. పాతపట్నం తాలూకాకు ఎంతోనష్టం కలుగుతుంటే, ఢిల్లీలోవున్న ఇంజనీర్లచేత పరిశీలన చేయించి ఇక్కడవుండే ప్రజలతో సన్నిహితత్వం కల్పించుకుని ప్రజలకు సరియైన వసతి కల్పించడానికి ప్లానువేసుకొని ఢిల్లీప్రభుత్వానికి, ఆంధ్ర ప్రభుత్వానికి తమద్వారా పంపించుకున్నాం అని మనవిచేస్తున్నాము. ఈ proposed area లో 24 వేల ఎకరాల భూమి మునిగిపోతుంది. పాతపట్నం తాలూకాదగ్గర గొట్టవద్ద రిజర్వాయరు కడితే సుమారు 26 వేల ఎకరాలభూమి మునిగిపోయే పరిస్థితి ఏర్పడుతుంది. వారికి ఏవిధమైన భూమి ఇవ్వడానికి లేదని అందరికి తెలిసినవిషయమే. దానికి నేను వ్యతిరేకంఅని ప్రచారాలు చేస్తుంటే నేను ఒక విషయం శాసనసభకు తెలియచేస్తున్నాను. ఆ ప్రాంతంలో కట్టడంవల్ల మునిగిపోయే ప్రమాదం లేకపోతే పాతపట్నం తాలూకా ప్రజ అభ్యంతరం చెప్పేదిలేదు. లేకపోతే 30 వేల ఎకరాలను నీటిలో ముంచి ధ్వంసముచేసి వేరేతాలూకాలలో రెండుపంటలు పండిస్తాము అనడం పాతపట్నం తాలూకాప్రజలు అంగీకరించరు అని చెప్పతున్నాను. రెగ్యులేటరు కట్టుకుంటే లక్షా యాభై వేల ఎకరాంకు నీటిసరఫరా జరిగే అవకాశంవున్నది. 30 వేల ఎకరాలను నీటిలో ముంచి, వాళ్లకు ఏ వసతిగూడా కల్పించడానికి అవకాశం లేకుండాచేసి 50 వేల ఎకరాలకు నీళ్లఇచ్చేబదులు, రెగ్యులేటరుకట్టి అనీటిని అన్నితాలూకాలకు ఉపయోగించబడేటట్లు చేయాలని కోరుతున్నాను. పాతపట్నం ఎస్టేటు మొన్నమొన్ననే స్వాధీనం అయినది. అక్కడ చెరువుల మరమ్మతులకు పూనుకోవాలని కోరుతున్నాను. అభివృద్ధి కార్యక్రమాలు అన్ని జరిగేటట్లు ఉపన్యాసం యిచ్చినందుకు గవర్నరుగార్ని, నాకు ఈ అవకాశాన్ని యిచ్చినందుకు అధ్యక్షులవారిని అభినందిస్తూ విరమిస్తున్నాను.

Sri G. Jagannadha Raju:—Mr. Speaker, Sir, in the Governor's address I find no particulars of the date by which Government wish to set up District Boards or their alternatives nor do we find in the address any indication of the nature of the substituted agency that is under contemplation of the Government. Sir, in almost all the District Boards, Special Officers were appointed with the exception of Visakhapatnam and Srikakulam two years ago. In the case of Visakhapatnam and Srikakulam, Special Officers were appointed, one and half years ago. Now we find from the address that under a Presidential enactment, the term of the Special Officers was extended upto 10th September and I may also state that it is very likely that that term will not be sufficient for the reconstitution of the District Boards or their substituted agencies. Today we find at the end of the two years that the Government are still contemplating the alternative proposals. So far, Government have not taken any decision. So, first they have to take a decision, then it has to go

(Sri G. Jagannadha Raju) [26th April, 1955

to the drafting department, and then as it is an important bill, it has to be circulated for public opinion. After that it has to come before the Assembly. It has then to be referred to the Select Committee, then passed and then enforced. So further extension of the term of Special Officers is of an absolute necessity. Sir, for a period of thirty years the District Boards were functioning under the management of non-officials. Then, suddenly they were transferred summarily into the hands of officials two years ago and they are now carrying on with their administration for years. This, Sir, it is a very retrograde step in a democratic country like ours. How long should this be continued? It is time Government should reconstitute the District Boards forthwith. The present Ministry has a life of five years. During that period they can leisurely decide the question of alternative agency.

In this connection I wish to say something regarding alternative agencies. In the agency contemplated at present the members will be elected indirectly from the Panchayats. This has two disadvantages. One is that major Panchayats now are governed by Executive Officers and the minor Panchayats are practically governed by the Panchayat and Assistant Panchayat Officers and they all have got full control over the members of the Panchayat Boards and they are the Government servants under Local Administration Department. The election will not be free. Another disadvantage is that in some districts like Visakhapatnam and Srikakulam there are no Panchayats in vast areas and the result will be that in the new District Boards there will be no representation for non-Panchayat areas.

One more item I have to say. In the National Extension Service Blocks Public Health, Communication, Medicine and Education have all been controlled by a separate agency. The expenditure on communications, education (primary and secondary) Public Health including sanitation and medicine has all been a legitimate charge on District Board funds. The District Boards have been financing these items and so these in the National Extension Service Blocks also may be placed under the charge of District Boards and provide them with necessary funds.

Another important subject I wish to mention here is about the Bimlipatam town. It is a town situated on the slope of a hill in between the hill and the sea. It is considered to be a sanatorium

26th April, 1955] (Sri G. Jagannadha Raju)

I believe several officers go there for a short stay to recoup health in summer. I am told that a tuberculosis sanatorium is to be located near about that town. In this town, a Harijan Colony and huts of fishermen are located thirty yards from the sea. In between the sea and the Harijan Colony and the huts of fishermen there is some sandy portion. It was all covered by prickly pear some years back, say 15 or 16 years ago. That prevented the sand from drifting into the interior. But the Municipality used cochnial to destroy prickly pear with the result that today all that prickly pear has completely disappeared, and the sand drifts into the huts of the fishermen and the Harijan colony. The Municipal Chairman Sri Suryanarayana Naidu brought this to the notice of the District Collector, who after inspection asked the P. W. D. at Parvatipur to take preventive measures. An estimate for Rs. 5200 was prepared and it was proposed to put up a protective ring of casuarina plantation to prevent the future inundation of sand and to remove the existing sand with bull-dozers and tractors. He wrote two letters, one to the Deputy Chief Minister and the other to Sri Thimma Reddi who was then in charge of Local Administration. The net result is that Government have issued a memorandum in 1954 saying that the whole matter is under contemplation and the question of the bull-dozers and tractors is under correspondence with engineers. The matter stands there still.

Meanwhile the sand hill rapidly inundated the Harijan colony and the huts of the fishermen and other buildings and in one or two places even traffic is being prevented. With these words, Sir, I resume my seat.

*Sri K. Brahmananda Reddi:—అధ్యక్ష మహాశయా! గవర్నరుగారి ప్రసంగానికి నా సంతోషాన్ని తెలియపరుస్తున్నాను. కాని ఆ ప్రసంగములో చెప్పినటువంటి కొన్ని విషయములకు మంత్రి వర్గమే పూర్తిబాధ్యులు కాబట్టి నేను కొన్ని remarks offer చేస్తే తప్పులేదని అనుకొంటున్నాను. నందికొండ ప్రాజెక్టు వస్తున్నందుకు చాలా సంతోషం. మా ప్రజలుకూడా చాలా సంతోషిస్తున్నారు. అయితే మూడు conditions fulfil అయితే తప్ప ఈ ప్రాజెక్టు రాదనేటువంటి భయము ఆ ప్రసంగములో అగుపడుచున్నది. మొదటి condition, betterment tax levy చేయాలని ఉంది. అందులో నా ఆక్షేపణలేదని మనవి చేస్తున్నాను. ఉమ్మడి రాష్ట్రంలో ఉన్నప్పుడు betterment tax ను వేసేందుకు ఒక Act చేయబడివున్నది. బహుశా అదే Act ను ఇక్కడ అమలు జరిపితే సరిపోతుందా లేకపోతే ఈ రాష్ట్రానికి ప్రత్యేకంగా ఒక Act ను చేయవలసిన అవసరమున్నదా అనే విషయాన్ని పరిశీలించవలసి యున్నది. రెండవది పదిరూపాయల శిస్తులేకుండా చేస్తామని గత ప్రభుత్వము చేసినటువంటి నిర్ణయాన్ని మరల ఈ ప్రభుత్వము వెనుకకు వెళ్లడం [illegible]

(Sri K Brahmananda Reddi) 26th April, 1955

బాగలేదు. అయితే ఇది ఒప్పుకోకపోతే నందికొండ ప్రాజెక్టు రాదేమోనని భయముతో దానిని అంగీకరించ వలసి వస్తున్నదని నేను మనవి చేయుచున్నాను. మూడవది బీదలు సాగుచేసుకొను చున్నటువంటి బంజరుభూములను వేలము వేయడమనేది చాలా కష్టతరంగా యున్నది. కనుక బీదవారుగాని, ఇంకొకరు గాని, ఎవరైతే ఏబంజరుభూమిని అనుభవిస్తున్నారో, ఆభూమిని market value కు అమ్ముకుండా లేక వేలము వేయకుండా nominal value వేసి ఆభూమిని అనుభవిస్తున్న వారికే, ఇస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. వారివద్దనుండి ఆ nominal value కొన్ని సంవత్సరములలో వసూలు చేసుకొనే ఏర్పాటుతో వారికే ఆ భూమిని ఇవ్వడం బాగుంటుంది. అట్లుగాకుండా market value అనిచెప్పి వేలమునకు పెట్టినట్లయితే, ఆభూములు పెద్దభూస్వాములకే కట్టిపెట్టినట్లవుతుంది. బీదలు వారితోపోటి చేయలేరు. ఇది మన "ఆవడి" Socialistic Pattern of Society కి పునాది కాదేమోనని అనుకొంటాను.

The Hon. Sri B. Gopala Reddi:—Auction వేస్తామని ఎక్కడా చెప్పలేదే!

Sri K. Brahmananda Reddi:—అమ్ముతామని అన్నారు. అంటే, ఎవరికి అమ్ముతారు, ఎట్లాఅమ్ముతారు, ధర ఎవరు నిర్ణయిస్తారు? అప్పుడు తగాదాలు వస్తాయి. కాబట్టి సహజంగా auction వేయవలసి వస్తుందని నేను మనవి చేస్తున్నాను.

ఎట్లయినప్పటికినీ, ఆ భూములను సాగుచేసుకునేవాళ్లకే వుంచి, ఏదో కొద్దిరుసుము వాళ్ళవద్ద నుంచి కొన్ని సంవత్సరాలలో instalments basis మీద వసూలుచేయడం న్యాయమని నా అభిప్రాయము. ప్రభుత్వం ఆవిధంగాచేయవలసిందని మనవిచేస్తున్నాను.

ఇక industries విషయంలో, ఏవో కొన్ని factories కట్టుతున్నామని చెప్పారు. ఈ factories ప్రభుత్వమే కట్టిస్తున్నారా లేక private agencies కట్టుతున్నాయా అనే సంగతికూడా తెలియకుండావున్నది. నందికొండ ప్రాజెక్టు విషయంలో చెప్పేటప్పుడు మాచర్లవద్ద ఒక సిమెంటు factory కట్టుతారని అనుకుంటున్నారు. అక్కడ ఏవో భూములు వగైరాలు కూడా కొంటున్నారని కూడా వింటున్నాను. ఈ factories ను ప్రభుత్వమే ఎందుకు start చేయగూడదో నాకు అర్థంకావడంలేదు. బహుశా ఇండస్ట్రీసు మంత్రిగారు, యిది private sector, అందువల్ల ఇది తీసుకోటానికి వీలులేదుఅని చెప్పబోతారేమో. అట్లా అయితే, నేను ఒక మాటచెప్పదలచాను. ఇది public sector అయినా, private sector అయినా, మనము ఎప్పుడుబడితే అప్పుడు మార్చుకోవచ్చును గనుక దీన్ని private sector లోకి తీసుకొనివచ్చి, అక్కడ కట్టబోయే cement factory వి గాని, యింకా అక్కడ కట్టబోయే యితర factories గాని ప్రభుత్వంవారి ఆధ్వర్యంక్రిందనే వదపాలవిన్ని, ప్రభుత్వం యొక్క ఖర్చుతోనే కట్టించాలని నా అభిప్రాయము. అట్లుకాకుండా private agency కు యిస్తే, మన కేంద్ర ప్రభుత్వంవారు అనుకునే socialistic pattern of society గాకుండా un-socialistic pattern of society క్రిందకు proceed అవుతున్నామేమోననే భయముకూడ కలుగుతుందని మనవి చేస్తున్నాను.

(Sri K. Brahmananda Reddi) [26th April, 1955

ఇక మూడవ విషయం. గవర్నరుగారి ఉపన్యాసంలో geological survey ను గురించి ఒక మాటకూడా చెప్పబడలేదు. ఈ geological survey మన ప్రభుత్వం అధ్వర్యంలోనిది కాదు, ఇది కేవలం కేంద్ర ప్రభుత్వంవారి అధ్వర్యంలో వున్నదని చెబుతారు. అటువంటప్పుడు కేంద్రప్రభుత్వమువారు మన రాష్ట్రములో ఎక్కువచోట్ల, ఎక్కువ చురుకుగా ఈ geological survey చేసేటట్టుగా చేయమని కోరుతున్నాను. ఈ geological survey ముఖ్యంగా మా గుంటూరు జిల్లాలో ఎంత అవసరమో చెబుతున్నాను. మా గుంటూరు జిల్లాలో ముఖ్యంగా మెట్ట తాలూకాలలో ఇనుము, ఉక్కు, యివికాకుండా బంగారంకూడా దొరుకుతుందని ప్రతీతిగా వున్నది. కాబట్టి ఇవి ఎంతవరకు దొరుకుతవో బాగుగ సర్వే చేయించి ఈ ఖనిజ సంపదను ఎక్కువ శీఘ్రకాలంలో బైటకు తీయించటానికి ప్రభుత్వం ప్రయత్నించాలని మనవిచేస్తున్నాను.

ఇంకొక విషయమువున్నది. దేశంలో stabilisation of prices విషయములో అనేక మంది గౌరవసభ్యులు మాట్లాడారు, ఇదేవిషయము. నేనుగూడ బలపరుస్తూ చెబుతున్నాను. ఇప్పుడు కొన్నింటికి ధరలు తగ్గిపోయినందున రైతులు ముఖ్యంగా కోర్దు ఖర్చులకు తాళలేక చాలాబాధపడుతున్నారు. మారటోరియము declare చేసే విషయము గత ప్రభుత్వమువారి ఆలోచనలోనేవుందని విన్నాను. కాని ఈ మారటోరియమును declare చేస్తే, అది రెండు సంవత్సరాలుఅని గాని, మూడు సంవత్సరాలుఅనిగాని, ఏదో ఇంతకాలమని నిర్ణయించి ప్రభుత్వము ఎందుకు declare చేయగూడదో సమాధానం చెప్పవలసివుందని మనవిచేస్తున్నాను.

Srimathi C. Ammanna Raja:—అధ్యక్షా, మీరు నాకు ఎంత టైముయిస్తారో నాకు తెలియకున్నది. ఈ సభలో 195 మంది సభ్యులు కూర్చున్నారు.

MR. SPEAKER:—I think I will have to reduce the time to 8 minutes for each speaker—

Srimathi C. Ammanna Raja:—No, Sir. That will come only after me. We are only three in this House out of 196 members, and we represent 51 per cent of the population. I suppose you will give me fifteen minutes if I happen to need it.

గవర్నరుగారి ప్రసంగముమీద చాలా చర్చజరిగింది. వారు చక్కని ప్రసంగము చేసినందుకు, దానివల్ల మనకు చాలా విషయాలు వారు తెలియచేసినందుకు, మనము వారిని అభినందించడము మన ధర్మము. వ్యతిరేక పక్షములో వున్నవారుకూడా వారికి అభినందనలు తెలియచేస్తూ కొన్నిమాటలు చేస్తే చాలాఅందముగా వుండేదేమోగాని, వారు ఆవిధంగా చేయలేదు సరేకదా, యింక ఏవేవో కొన్ని ఆరోపణలు గవర్నమెంటుమీద చేయడము ప్రారంభించారు. ఇందులో కొందరి ఉపన్యాసాలు [illegible] ఇక్కడకూడ election ఉపన్యాసాలు continue చేస్తున్నట్లుగా నాకు అనిపించింది. మన [illegible] వర్గాలలో అవి విని విని విసుగెత్తి, చాలుబాబూ! అనుకున్నటి యిక్కడకూడా ప్రారంభించారు, [illegible] ధరల యొక్క విషయము చాలా [illegible]గావున్నది. [illegible]

(Srimathi C. Ammanna Raja) [26th April, 1955

అన్నారు. వారు ఆవిధంగా అనడం చాలా అధర్మమని అంటాను. ఏవో కొన్నిసంగతులు చెపుతూ, అమ్మన్న రాజాగారు ఈ విధంగా అన్నారని చెప్పారు. కాని నేను ఎక్కడ, ఏసంగతులు అన్నానో చెబితే బాగుంటుంది. నేనెన్నడునూ పెళ్లిళ్లవిషయం, భార్యభర్తల విషయం, విడాకుల విషయం చెప్పడముగాని, వినడంగాని జరగలేదు. అసలు నాకు అటువంటి విషయాలు యిష్టంలేదు సరేకదా, ఒకవేళ ఎవరైనా అటువంటి విషయాలు చెప్పినప్పుడు, నాకు కొంచెము కటువుగావే కన్పించేది. "ఎందుకు – యీగొడవ" అని అనుకువేవాళ్లము. "వాళ్లయిష్టప్రకారము వాళ్లు చేసుకుంటూ వుంటారు. మనపద్ధతి మనది. వారి పద్ధతివారిది" అని అనుకువేవాళ్లము. కాని, నేను మాత్రము ఎన్నడూగూడ యిటువంటి విషయాలు చర్చించలేదు. గనుక నేను అన్నాను అని చెప్పడమనేది చాలా అధర్మమని అంటున్నాను.

ఆంధ్రరాష్ట్రము వచ్చి కొద్దికాలము అయినప్పటికినీ, యింతవరకు మనము గర్వించతగినన్ని పనులు మనము చేయగలిగినామని నాకు చాలా సంతోషముగా వున్నది. ఈ మధ్య మంత్రుల పరిపాల నకు ఆటంకమువచ్చి, రాష్ట్రం గవర్నరుగారిచే పరిపాలించబడినప్పటికి గూడా ఆ సమయములో ఏవిధమైన ఆటంకముగూడా లేకుండా నందికొండ విషయములోగాని, మరొకవిషయములోగాని ప్రభుత్వ పరిపాలన గవర్నరుగారివల్ల, సక్రమంగా నడపబడింది. వారు చాలా సమర్థతతో ప్రభుత్వము నడిపి నందుకు వారిని నిజముగా మనము అభినందించవలసినదే. కాని ఒక్క విషయముమాత్రం వారు చెప్పినట్లయితే బాగుండేదేమో. ఉమ్మడి మద్రాసురాష్ట్రమునుంచి మనరాష్ట్రము విడిపోయినప్పటికి గూడా, యింకను పూర్తిగా విడిపోయినట్లు కన్పించడములేదు. ఇందుకు కారణము—ఇంకను మన ఆంధ్ర గవర్నమెంటుకు చెందిన కొన్ని ఆఫీసులు మద్రాసులోనే ఉండడం. అవి మన రాష్ట్రం లోకి ఎప్పుడు తరలిస్తారో తెలియజేయలేదు. ఎప్పుడు తరలిస్తారో గవర్నరుగారు చెప్పి నట్లయితే బాగుండేది. ఆ ఆఫీసులకు కర్నూలులో buildings లేనప్పుడు విజయవాడ లోనో, Waltair లోనో, వాటికిగాను buldings కట్టించి, అక్కడికి ఆ ఆఫీసులను తరలించి నట్లయితే, మన విభజన అక్కడతో పూర్తిఅయిందని సంతోషము పడేవాళ్లమే మోనని అనుకుంటున్నాను. ఈ మూలంగా, అక్కడ మద్రాసులో యీ ఆఫీసులుకొరకు యిచ్చుకో వలసిన అద్దె మద్రాసువారికి కట్టిబెట్టడమనేది, మనది బీదరాష్ట్రము గనుక, అంతసమంజసముగా లేదని నా అభిప్రాయము.

మరొక విషయము చెబుతున్నాను. వాంఛూగారి రిపోర్టులో ఉమ్మడి మద్రాసురాష్ట్రములోవున్న medical institutes ఉమ్మడిగా వుండేటట్టుగా వ్రాశారు. కానివాటికి counter parts మన రాష్ట్రంలోగూడా వుంటే తప్ప, అది పూర్తివిభజన కాదని నా అభిప్రాయము. గిండీలో King Institute వున్నది. అది చాలా ముఖ్యమైనది. ఆ Institute లో research work నడిపి, ఏవో జబ్బులు వెంటనే diagnise చేసి తెలియజేయడం జరుగుతున్నది. కాని treatment మాత్రం మరొకచోట జరగడమువల్ల, దీనికి చాలా ఆలస్యము అవుతున్నది. ఖర్చుగూడా ఎక్కువ అవుతున్నది. ఇప్పుడు మద్రాసు ప్రభుత్వము వారికి మనకు యీ King Institute విషయంలోగల సంబంధము ఏమిటో నాకు తెలియదు. కాబట్టి దానివిషయంలో కొంచెము వివరించి నట్లయితే నేను సంతోషిస్తాను. అంతే కాకుండా, యీ research institute ను మన ఆంధ్ర

26th April, 1955] (Srimathi C. Ammanna Raja)

రాష్ట్రములోగూడా ఎక్కడైనా పెట్టుకోగలమా, పెట్టుకునే సమయము వస్తే, అదెప్పుడు జరుగుతుంది అనే ఆలోచన ఏమైనా ప్రభుత్వానికి వున్నదో లేదో చెబితే సంతోషిస్తాను.

అవిధంగానే ఇప్పటికి మద్రాసు రాష్ట్రంమీద ఆధారపడుతున్న వాటిలో—వెటర్నరీకాలేజి ఒకటి. అక్కడ చదువుకునివచ్చిన స్టూడెంట్సునే మనం employ చేయవలసి వస్తున్నది. మన స్టూడెంట్సు అక్కడకువెళ్లి చదవవలసివస్తున్నది. ఇంకో చిన్నవిషయం. Textile Institute లో weaving and spinning నేర్చుకునేవారు III ఫారం మాత్రమే చదువుకున్నవారు. కాని అక్కడ అరవంలో పాఠాలు చెబుతారు కనుక మన విద్యార్థులు అర్థంచేసుకోలేక అవస్థపడుతున్నారు. ఇంగ్లీషులో చెప్పినా వారికి అర్థంకావడం కష్టం. అందుచేత మనకు ఒక Textile Institute స్థాపించినట్లయితే ఉపయోగకరంగావుండి మన రాష్ట్రం అభివృద్ధిచెందుతుంది.

నందికొండ విషయం చాలమంది ప్రసంగించారు. సర్కారువారంతా—విశాఖ, శ్రీకాకుళం జిల్లాల వారుతప్ప-సంతోషాన్ని వెలిబుచ్చారు. రాయలసీమవారు half-heartedగా సంతోషం వెలిబుచ్చారు. రామకృష్ణరాజుగారు విశాలదృష్టిఅని చెబుతూ చిన్నచిన్న ప్రాజెక్టులు, వెనుకబడిన ప్రాంతాలు దృష్టిలో ఉంచుకోవాలి అన్నారు. అది న్యాయమైన విషయంకాదు. ఇప్పుడు మన రాష్ట్రం యొక్కగాని, మనదేశం యొక్కగాని అభివృద్ధి యితర దేశాలవారు చూచి సంతోషించాలంటే ఏ canal వెడల్పుచేశారు, ఏ చెఱువులుత్రవ్వించారు అన్నది ముఖ్యంకాదు. భాక్రానంగల్, హిరాకుడ్, కోసీ, దామోదరవాలీ లాంటి పెద్ద ప్రాజెక్టులు నిర్వహించాలని కోరుతున్నాను. అందుచేత నందికొండ నిజంగా మనరాష్ట్రంలో national development కు చాలా అవసరమైవున్నది. దానిని గురించి యింకోవిధంగా అభిప్రాయపడడం చాల అన్యాయమైన విషయం. ఇంకో కారణం యేమిటంటే అది హైదరాబాదు వారికీ మనకు కలిసివున్నది. అసలే యిప్పుడు మనలో కలియడానికి హైదరాబాదు వారు సందేహిస్తున్నారు. అందుచేత మనకింత తొందరపాటుకూడదు. ఇటువంటి వాటిలో ప్రాంతీయ అభిమానాలకు అభిప్రాయబేధాలకు తావులేదు. ఇది దేశం మొత్తంమీద self-sufficient గా వుండడానికి వుపయోగించే ప్రాజెక్టు కనుక కేంద్ర ప్రభుత్వంవారు సహాయంచేస్తున్నారు. దేశం మొత్తంమీద చాల అభివృద్ధికరమైన పనులుచేస్తున్నారు. Five Year Plan అమలుచేసి దేశాభివృద్ధికి అవకాశాలు కల్పించారు. నీటి సరఫరా ప్రాజెక్టులు, National Extension Schemes, Social Welfare Schemes అమలుపరచి దేశాన్ని నందనవనంగా మార్చే ప్రయత్నం చేస్తున్నారు. ప్రతి గ్రామం అభివృద్ధికి చాలా అవకాశాలు కలుగజేశారు.

ఇక వేయి single teacher schools తెరచి చాలమందికి వృత్తి కల్పించినందుకు నా అభినందనలు తెలుపుతున్నాను. అటాంటి స్కూల్సు నిజంగా చాల అవసరం. గ్రామాలకు మట్టి రోడ్లుకూడా లేని మన దేశంలో యింకో thousand schools మన గవర్నమెంటు పెట్టినట్లయితే విద్య అందుబాటులో వుండి కనీసం 4th class వరకైనా గ్రామీణులకు చదువు చెప్పించినట్లవుతుంది. ఆ విధంగా చేయగలిగినట్లయితే చాలా సంతోషం.

ఇంక రోడ్లవిషయం: మన రాష్ట్రంలో గ్రామాల్లో ఎక్కువరోడ్లు లేకపోవడంవల్ల ప్రజలు చాలా [illegible] పడుతున్నారు. [illegible] elections లోనే దాని కష్టం అందరం తెలుసుకున్నాం అనుకుం

టాను. పెద్దవారు కొంతమంది ఎలక్షను ప్రచారానికి 3 గంటల ఆలస్యంగావచ్చి, ఏమికారణం అంటే మీ రోడ్లట్లావున్నాయి అన్నారు. రోడ్లయినా కనీసం లేకపోయినట్లయితే పండించే పంటలను తర్లించడానికి చాలకష్టంగా వుంటుందన్నది గమనించివలసిన విషయం. ఇంకా నా అనుభవంలో చాల విచారపడవలసిన విషయం మలేరియా వ్యాధిగురించి. కేంద్రప్రభుత్వంవారు దీని నివారణగురించి చాల కృషిచేశారు. Mosquitoes లేకుండా చేయడానికి చాల steps తీసుకున్నారు. ఐనప్పటికీకూడా యింకా mosquito బాధ తొలగలేదు. తుణుకు తాలూకా, శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలో filaria గురించి శ్రద్ధ తీసుకొవలేదు. దీని విషయమై ఏమాత్రం శ్రద్ధ తీసుకున్నప్పటికి యీ వ్యాధి పూర్తిగా లేకుండా చేయగలం అని అనుకుంటున్నాను. ఇది చాల అసహ్యకరమైన రోగం. కావలిస్తే కేంద్ర ప్రభుత్వంవారి సహాయం తీసుకొని యీ విషయమై శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. ఇంక నంది కొండ విషయం చెప్పినప్పుడు చిన్నచిన్న ప్రాజెక్టులుకూడా తీసుకోవాలని కొందరు చెప్పారు. సంజీవరెడ్డి గారు చెప్పారు 17 చిన్న స్కీములు తీసుకున్నాం అవి. అందులో 8 రాయలసీమలోనివి. K. C. canal కు 3 కోట్ల scheme వున్నది. Cement concrete తో 42 మైళ్ళు కాలువ కట్టినట్లు ఈ సావనీరులో ఒకచోట వ్రాశారు. ఏమంటే నీరు తొందరగా supply చేసినప్పటికి ఏవిధంగానూ వుపయోగించుకోడం లేదని, dry ప్రాంతం అయిన రాయలసీమ రైతులకు నీటి వుప యోగం నేర్పవలసి వున్నదని ఇంజనీర్లు చెబుతున్నారు. ఈ విషయం యిదివరకు మాట్లాడిన రాయలసీమ సోదరులు వారి ప్రాంతాలలో ప్రచారంచేస్తే బాగుంటుంది అనుకుంటున్నాను. ఆవిధంగా కొంత ప్రచారం చేసినట్లయితే నీరు వృధాగా పోదని చెబుతూ ఈ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షుల వారికి నమస్కారిస్తూ ముగిస్తున్నాను.

*V. Kurmayya:—అధ్యక్షా, నేను శ్రీ రాజేశ్వరరావుగారిచే ప్రతిపాదించబడిన తీర్మానాన్ని బలపరుస్తున్నాను. ఈ సందర్భంలో యీ సభలో చాలమంది వ్యవసాయ కూలీల గురించి, హరిజనులగురించి, రైతులగురించి, industrial కూలీలగురించి మాట్లాడారు. వ్యవసాయ కూలీలగురించి మాట్లాడేవారు వ్యవసాయ కూలీల కష్టాలు బాగా తెలుసుకుని వారియొక్క కష్టాలు యీడేర్చడానికి ప్రయత్నిస్తే చాల బాగుంటుంది. కమ్యూనిస్టు పార్టీవారు వ్యవసాయ కూలీల పేరుతోటి వారిని లోబరుచుకుని రైతులమీద రెచ్చగొడుతున్న విషయం గత 5,6 సంవత్సరాలనుంచి మనకు అను భవ పూర్వకంగా తెలుసును. ఈ సందర్భంలో మందరయ్యగారిని నేను కోరేదేమిటంటే వ్యవసాయ కూలీల తరఫున వారి కష్టాలగురించి మాట్లాడేటప్పుడు వారి ప్రతినిధులు రైతులపైన ఒక విధమైన టువంటి ద్వేషాన్ని పురిగొలిపే ప్రయత్నాలు విరమించమని సలహా యిస్తున్నాను.

భూస్వాములు, రైతులు, వ్యవసాయ కూలీలను అనేక కష్టాలుపెట్టారని వారు చెప్పారు. కమ్యూనిస్టుపార్టీవారు రైతులను కూలీలను గొడ్డలి పట్టుకొనివచ్చి కొట్టడము దివితాలూకా మొవ్వ గ్రామములో జరిగింది. అదేవిధముగ నా గుడివాడ constituency లో తమిరిశ అను గ్రామములో కమ్యూనిస్టులే హరిజనులను బెదరించి కొట్టడము జరిగింది. వారు గుడివాడ హాస్పిటలులో యుంచ బడినారు. కాంగ్రెసువారు శాంతిమార్గముతో ప్రవర్తించారు. మాకు యిష్టములేకపోతే మాలపల్లెకు వెళ్లము. కమ్యూనిస్టులు 'we are the guardians of Harijans' అని చెప్పుకొన్నారు. అట్లు చెప్పుకొనుట మంచిదిగాదని నాసలహా. కాంగ్రెస్ సంస్థ అస్పృశ్యతా నివారణచేసింది. కమ్యూనిస్టులు

26th April, 1955] (Sri V. Kurmayya)

తమ అనుచరులు ఏమైన చేశారాఅని సవాలుచేస్తున్నాను. కమ్యూనిస్టులు హరిజనులను మోసముచేస్తున్నారు. కాంగ్రెస్‌వాదులు ఎన్నికలలో హరిజనులను బాధలుపెట్టిన సంఘటనలు చూపెట్టమని సవాలుచేస్తున్నాను. భూముల పంపిణీ విషయములో జస్టిస్‌పార్టీ ప్రభుత్వమంచికూడ మంత్రివర్గం మారినప్పుడెల్లా ప్రభుత్వవిధానం మార్పు చెందుతూవచ్చింది. భూవసతిలేని వ్యవసాయదారులకు మాత్రమే బంజర్లను పంచాలని నేను మొదటినుంచి కోరుతూవచ్చాను. నేను మంత్రిగాయున్నప్పుడు 1949 లో హరిజనులకు తదితర బీదలకు ఉచితముగా పోరంబోకులు యివ్వాలని G. O చేసినాము. హరిజనులకు ex-toddy tappers కు యీ బంజరు భూములను పంచాలని కోరుచున్నాను. హరిజనుల విద్యా విషయములోకూడ కాంగ్రెస్ చాలతోడ్పడిందని నేను చెప్పగలుగుతున్నాను. హరిజనులకు యిండ్లు కట్టుకొనుటకు స్థలాలుయివ్వాలి. వాండ్లకు మంచి నీటిసౌకర్యాలు కలుగజేయాలి. అన్ని గ్రామాలలో కూడ మంచినీటి సప్లయిచేయాలి. National Extension Schemes పెట్టిన గ్రామాలలో గ్రామస్థులు 50 % మొత్తము యివ్వాలని పట్టుబట్టడము సబబుకాదు. మాలపల్లెలకు రోడ్లువేయాలి, నీటిసరఫరాచేయాలి. Sanitation improve చేయాలి, హరిజన గూడెములు బాగు చేయ్యాలని కోరుతున్నాను.

*Sri S. Ranganatha Mudaliar:—Mr. Speaker, Sir, with regard to the observation of the Governor in his address that the conduct of elections was smooth, I agree with Mr. Ramakrishna Raju. So far as elections in Chittoor District are concerned, they were as smooth as they could be. This will be testified to by the Communist candidates themselves who contested in 3 or 4 places in my district. The election was smooth and except for one or two incidents that took place in my own constituency, nothing extraordinary happened. But, one amusing kind of canvassing resorted to by my Congress opponent was to take the police van whenever he went to canvass for votes. For the first time, the Congress candidate demanded votes at the point of the bayonet. It is a very amusing thing and I hope it will not happen on any occasion in future.

Sri P. Venkatasubbayya:—అధ్యక్షా, ఈ సభలో పత్రికలు చదవడం, మంచినీళ్ళు శ్రోతలకి తెప్పుకుని త్రాగడం పరిపాటిగా కనబడుతూంది. ఇది చేయవచ్చునేమో, తమరు రూలింగు యివ్వాలని ప్రార్థిస్తున్నాను.

Mr. Speaker:—పత్రికలు చదువడము మాత్రము కూడదని మనకు యిదివరకు తెలిసిన సంగతే, కాని గొంతుక ఎండినప్పుడు కష్టంగా ఉంటుంది కాబట్టి, మంచినీళ్ళు త్రాగడం మంచిదే అని అంటున్నాను. (Laughter).

Sri S. Ranganatha Mudaliar:—As regards the amendment moved by Sri Ramakrishna Raju about the need for exempting the ryots permanently who pay Rs. 10/- and less, I may tell you, Sir,

that it is not only just, but it is very necessary also in the interests of the Congress party itself. Exemption has been provided for under several fiscal legislations; there are merchants who have been granted exemption under Sales Tax Act; there are assessees under the Imcome-Tax Act who are given exemption and similar exemptions are given to persons concerned in several such measures. I do not see any reason why the poor ryot paying Rs. 10/- and less should not be entitled to a permanent exemption which is very just. Also, it is very necessary in the interests of the Congress party itself. I know that most of my Congress friends who contested in the elections promised their constituents that they would go and make the Government implement this order on a permanent basis. I do not know what my friends are going to say when they are confronted with the electorate after leaving this Assembly. Their plight will be anything but pleasant. Therefore I submit that in the interests of my Congress friends themselves, it is very necessary that the exemption should remain. Otherwise it would give ample scope for the Communist party to exploit the situation and in the course of the next election campaign they would go to the poor ryots and tell them, "Look at your friends who promised so much but did nothing in regard to this simple matter." Then, my Congress friends must thank themselves for such a situation. Therefore, Sir, it is absolutely necessary that this exemption must be given to the poor ryots once and for all.

Then Mr. Ramakrishna Raju has proposed another amendment. Because it was a novel suggestion, I felt it did not strike the hon. Members of this Assembly as anything worth considering. I refer to the phrase 'my Government' in the Governor's Address. My submission is that it is a vestige of autocracy born of our association with British Raj. There is absolutely no reason to continue that phraseology any longer when ours is a pucca democratic Government. It may be that in other Assemblies in other States, the same expression is adopted; it may be that the President of the Indian Republic uses the same expression. But that does not give any consecration to that expression. It is absolutely necessary that this phraseology should be replaced in conformity with our democratic principles.

The Hon. Sri B. Gopala Reddi:—How can we change?

Sri S. Ranganatha Mudaliar:—So far as I know, and I am open to correction, the President of the United States of America

does not say 'my Government.' He simply says 'this administration.' Therefore, the Governor can say 'this State' or 'our Government. ..........'.

The Hon. Sri B. Gopala Reddi:—Constitution does not allow it.

Sri S. Ranganatha Mudaliar:—If that is so, let there be no personal element, singular or plural. Let it be, 'this administration' or 'this State.' Anyhow, Sir, I submit that Mr. Ramakrishna Raju's suggestion is worth consideration by this House.

Then, Sir, I am coming to the main amendment. It is very unfortunate that no mention is made in the Governor's Address about the powerful Tamil minority community that live in this State. That is probably due to the reason that the Governor or the topmen in the administration are not put in possession of real facts. Evidently they do not know that about 3 lakhs of Tamils are subjects of this Andhra State. I know, when some hon. Members who form the Cabinet visited some of our Tamil areas in Chittoor District, they were not given proper information. In one case, on one occasion, one gentleman was informed that so far as Tiruttani was concerned—Tiruttani is one place where 99% are Tamils—99% were Telugus and only 1% Tamils and that 1% consisted of saloon-keepers and plate (—) cleaners. It is only such information that made the members of the administration ignore the Tamils. They do not know that about 3 lakhs of Tamils are subjects of this State. In Tiruttani taluk, according to the census of 1931, Tamils were 51%. Now it has increased to 63%. In Chittoor town, the percentage of Tamils is 67% and in Chittoor taluk it is about 50% and more. In Tiruttani, in Puttur, Karvetnagar and Narayanavaram firkas, the Tamil population is between 50 and 58%. On the whole, there are 3 lakhs of Tamils in this State. Unfortunatey these Tamils occupy the position analogous to that of the Andhras in Orissa and Bellary. The Tamils have absolutely no facilities for studying Tamil. There is no provision in the Municipal Schools for Tamil from the infant standard to the Matriculation Class. There is one Municipal High School for Girls, one Middle School and a number of elementary schools, and yet no provision has been made for the admission of Tamil children in those schools. In most of the District Board schools also, no

(Sri S. Ranganatha Mudaliar) [26th April, 1955

provision has been made for the education of the Tamil children in their own mother tongue. In the High Schools at Chittoor and at Tiruttani, only one section is provided and it is niggardly. There are enough students to accommodate two sections and I do not know why the Government should be so negligent in regard to the admission of Tamil children in these High Schools There are 270 single-teacher schools in my area and not one school has provision for admission of Tamil children. When we go to the authorities concerned, they say there is absolutely no provision for Tamil schools being opened. When we want Tamil teachers they say there are no trained teachers available. Therefore, when we think of starting private schools, we do not get recognition since, it is stated that after the formation of the Andhra State, there is no need for Tamil Training Schools. Then what about Tamil children? The authorities say, " either have Telugu section or have no training". There is a Government Training School at Chittoor, but no provision is made there for the admission of Tamil pupil teachers. Every year we have to carry on agitation from February to August and then only we are able to get one section in the Training School at Chittoor. But there is no provision so far for the admission of Secondary Grade pupil teachers in the Government Training School. Either there should be a Tamil Training School or permanent provision has to be made in the Government Training School for admission of Tamil pupil teachers both in the Secondary grade section and in Elementary grade section.

Sir, the position of the Tamils is very pathetic. They are getting only step-motherly treatment from the District Authorities. They don't see eye to eye with our needs. Hon'ble members can visualize and appreciate the feelings of their Andhra brothren in Orissa and Bellary. Why don't you extend the same sympathetic consideration to the problem of the Tamils in your Chittoor District? If you want them, you must give them equal rights and equal opportunities along with your Telugu subjects. Then again, qualified Tamil youths have absolutely no chance for service in this State. That is also a point for the Government to consider. We are like the old Anglo-Indian community which India did not want and which England did not own. In the Andhra State, we are not wanted and the Madras State does not own us. If we are sent away, we will welcome it. But so long as we are in your State, we are entitled to every right under the beneficial regime of this State. I have done, Mr. Speaker.

26th April, 1955]

*Sri Chinnama Reddi:—అధ్యక్షా, గవర్నరుగారు ఉపన్యాసంలో చెప్పిన విషయాలు గురించి వారికి నేను అభివందనములు తెలుపుతున్నాను. శ్రేయోరాజ్య స్థాపనకు అనుగుణంగా వారి ఉపన్యాసంలో అనేక అభివృద్ధి కార్యక్రమాలు సూచింపబడినాయి. ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ ప్రాంతం వెనుకబడిన ప్రాంతంగాను కరువు ప్రాంతంగాను తెలియపరుచబడుతోంది. అందులో చిత్తూరుజిల్లా మరింత కరువు ప్రాంతంగావున్నది. అన్ని తాలూకాలలోను చిత్తూరు తాలూకా ఎక్కువ కరువుప్రాంతంగా భావించబడుతోంది. అటువంటి చిత్తూరు నియోజకవర్గంనుంచి నేను శాసనసభ్యుడుగా ఎన్నుకోబడినాను. ఇపుడు నేను ఎన్నుకోబడిన నియోజకవర్గానికి కావలసిన సౌకర్యాలు గురించి కొంత వరకు చెప్పదలచుకున్నాను.

ఈ చిత్తూరుజిల్లా మన ఆంధ్రరాష్ట్రంలో కడపటిదిగా ఉన్నది. అందువల్లనే అది గవర్నరుగారి దృష్టికిని మంత్రుల దృష్టికిని చాలా దూరముగా కనబడుతున్నట్లున్నది. అటువంటి కరువు ప్రాంతము గురించి గవర్నరుగారి ఉపన్యాసంలో ఒకమాటైనా లేకపోవడం చాలా శోచనీయం. చిత్తూరుజిల్లాలో గొప్ప నదులుగాని, గొప్ప చెరువులుగాని లేవు. ఎల్లప్పుడు జలాధారానికి వర్షముపైననే ఆధారపడవలసి యున్నది. వర్షముకూడ చాలా తక్కువగా పడడంవల్ల, అక్కడ రైతులు చాలా కష్టపడుతున్నసంగతి ప్రభుత్వమునకు తెలిసిన విషయమే. ఇట్టి పరిస్థితులలో, పెద్ద ప్రాజెక్టులవల్లగాని, ఆనకట్టల వల్లగాని చిత్తూరుజిల్లాకు నీరువచ్చే అవకాశం ఉన్నదా అనిచూస్తే, అటువంటి దేమి కనుపించలేదు. వాటి లాభము కడపతో అంతమౌతుంది. చిత్తూరు జిల్లాలో ఏ ప్రాజెక్టువల్ల నీరు సరఫరా అయ్యేమార్గం కన్పడలేదు. కాబట్టి అక్కడ ప్రజలకు సహాయము చేయవలెనంటే, అక్కడ ఉన్నట్టువంటి చిన్న నదులు, వంకలు వీటివల్ల నీరు బాగుగా సరఫరాఅయ్యే సదుపాయములు కలిగించి వారికి కావలసిన సౌకర్యములు కలిగించుట ప్రభుత్వముయొక్క ముఖ్య కర్తవ్యము. లేక పోయిన ఆ ప్రజలు ఇతరచోట్లకు వలసపోవాలన్నా వీలుకాదు. ముఖ్యంగా చిత్తూరుతాలూకా చాలా జనసమ్మర్దముగల ప్రదేశము. అక్కడఉన్న రైతులలో నూటికి 80 మందికిపైగా 2 ఎకరాలకు లోపుగా ఉన్నవారే. ఇటువంటి పరిస్థితులలో వారికి తగువైన సదుపాయములు కలుగజేయకపోయిన వారు చాలా కష్టాలకు గురికావలసి యుంటుంది. కనుక అక్కడఉండే చిన్ననదులు, వంకలవల్ల నీరు సరఫరా అయ్యేవిధముగా, చిన్నచిన్న minor irrigation ప్రాజెక్టులు ఏర్పాటు చేయవలెనని కోరుతున్నాను. ఇతర ప్రదేశాలలో ప్రభుత్వము కోట్లకొలది ఖర్చుచేయుచుండిన సందర్భంలో ఇక్కడ కొన్ని వేలుఅయినా ఖర్చుచేసి minor irrigation schemes ఏర్పాటు చేసినట్లయిన అక్కడి పొలములకు కొంతనీరు లభించగలదు. దానివల్ల బావులలో బాగుగా ఊటవచ్చుటకు కూడ అనుకూలముగానుండును. ఇప్పుడు అక్కడఉన్న పరిస్థితులనుబట్టి, అక్కడ వరి పండించుటకు అసాధ్యముగాఉన్నది. అక్కడ ఉన్నటువంటి రైతులు తమ జీవనానికి కావలసినటువంటి వరి మాత్రము ఏదోవిధంగా చేసుకొంటూ మిగతా భూమిలో చెరకు సాగుచేసుకొంటున్నారు. చిత్తూరు తాలూకాలో దాదాపు 15 వేల ఎకరాలలో చెరకుసాగు అవుతున్నది. ఇప్పుడు చెరకుధర చాలా పడిపోయి చాలా ఇబ్బందులు పడుతున్నారు. ధరలు ఎక్కువ తారుమారు అవుతున్నాయి. మేము చెరకు అధికంగా పండించినప్పుడు, ధరలు తగ్గడం, తక్కువగా పండించినప్పుడు, ధరలు పెరగడం ఈవిధంగా జరుగుతున్నది. అక్కడ ఒక Sugar Factory ఏర్పాటు చేయవలసినదని, అనేకమంది రైతులు [illegible] పదిరోజుల క్రిందటనే

రిజిష్ట్రారువద్ద, co-operative basis మీద ఒక చక్కెర factory ని ఏర్పాటు చేయవలసిందిగా మనవిచేశారు. వారుకూడ కేంద్రప్రభుత్వానికి తగిన recommendation చేసి సహాయం చేస్తామని సెలవిచ్చారు. రాష్ట్రప్రభుత్వముకూడ చిత్తూరులో ఒక sugar factory ఏర్పాటు చేసేందుకు తగిన వసతులు ఏర్పాటు చేయవలెనని కోరుచున్నాను. ముఖ్యంగా అక్కడ వరిసాగు అగుట చాలా కష్టము. అక్కడ గ్రామాలకు electricity సరఫరా చేయించే విషయములో, electricity rates అధికం చేయనున్నారని తెలియవచ్చినది. ఇతరచోట్ల ధరయెక్కువగా వుండినందువల్ల అన్నిచోట్ల ధరలు సమానంగా ఉండేటట్లు ఇక్కడకూడ rates హెచ్చించవలెనని ఆలోచిస్తున్నట్లు తెలిసింది. ఈ విధంగా చేయకూడదని కోరుచున్నాను. రైతులు ఇప్పుడు ఉపయోగిస్తున్న pump sets, oil engines కు అగుఖర్చుకు సమానంగా ఈ electricity rates అయ్యే పక్షములో, electricity ఎందుకు అనే ఆలోచన వారిలో కలుగచేసింది. మెట్టూరునుంచి మాకు electricity వస్తున్నది. మాకు చాలాకాలముగా మద్రాసువారు తక్కువరేట్లకు electricity ఇస్తున్నారు. కనుక ఇదివరకు ఉన్న తక్కువరేట్లనే యథాతథంగా ఉంచవలెనని కోరుచున్నాను.

తరువాత చిత్తూరు మునిసిపాలిటీనిగురించి ఒక విషయం మనవిచేస్తున్నాను. చిత్తూరు జిల్లాకు కేంద్రమైనటువంటి చిత్తూరు మునిసిపాలిటీలో 20 వ శతాబ్దమునందుగూడ త్రాగుటకు నీరు లేకుండా ప్రజలు అవస్థపడుచున్నారు. దాని విషయము ప్రభుత్వము గుర్తించివలసి యున్నది. అన్ని మునిసిపాలిటీలవలె అభివృద్ధిచెందుటకు గొప్ప అవకాశంలేకుండా, పట్టణము చిన్నదిగా ఉన్నది. ఈ మునిసిపాలిటి ఇదివరకు పన్నులను అధికంచేసింది గాని water supply కి తగిన ద్రవ్యము వసూలు కావడంలేదు. కాబట్టి ప్రభుత్వము ఈ మునిసిపాలిటీకి ఎక్కువ ద్రవ్యము కేటాయించి అక్కడ water supply scheme, drainage scheme శీఘ్రంగా వచ్చేటట్లు చేయవలసిందని కోరుతున్నాను.

తరువాత చిత్తూరు తాలుకాలో 25 మైళ్ల చుట్టుప్రక్కల ప్రాంతాలకు చిత్తూరు ఆస్పత్రి ఒకటి తప్పితే మరొకటిలేదు. ఆ ఆస్పత్రిలోకూడ 50, 60 బెడ్స్‌మాత్రం వున్నవి. అక్కడవచ్చే రోగుల సంఖ్య బట్టిచూస్తే ఆ ఆస్పత్రిలో వసతి ఏమాత్రము చాలదు. రోగులు బయట ఎక్కడపడితే అక్కడ పడుకొంటూ చాలా కష్టబడుతున్నారు. కనుక ఆ ఆస్పత్రికి ఇంకా ఎక్కువ కట్టడాలు కట్టించి దాన్ని అభివృద్ధిచేయవలసిందని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

*Sri P. Bapayya:—అధ్యక్ష మహాశయా, నేను శ్రీరాజేశ్వరరావుగారు ప్రతిపాదించిన అభినందన తీర్మానమును బలపరచుచున్నాను. ఈ నందికొండ ప్రాజెక్టుకు నాగార్జునసాగరు అని పేరు పెట్టడానికి మన ప్రభుత్వంవారు, హైదరాబాద్ ప్రభుత్వమువారు నిశ్చయించినట్లు ఈ మధ్య పత్రికలలో చదివాము. ఇది చాలా సంతోషమైనటువంటి విషయము. ఆంధ్రదేశం ఎంతోకాలం నుంచి ఆందోళనచేస్తూ, ఆశిస్తున్నటువంటి ఈ బ్రహ్మాండమైన, నందికొండ ప్రాజెక్టు పంచవర్ష ప్రణాళికలో చేర్చారని పని ప్రారంభింపబడుతున్నదని గవర్నరుగారి ప్రసంగంలో ఉన్నప్పుడు దేశాభిమానము కల్గినటువంటి ప్రతి ఆంధ్రుడు ఈ ప్రసంగాన్ని అభినందించకుండా ఉండజాలడు. ఈ ప్రసంగములో ఒక నందికొండ ప్రాజెక్టు విషయమేకాకుండా ఇంకా కొన్ని పెద్ద, చిన్న, మధ్య

26th April, 1955] (Sri P Bapayya)

రకపు irrigation projects కు గాను పదికోట్లు కేటాయించవలసిందిగా కేంద్రమును కోరినట్లు కూడ చెప్పబడినది.

వ్యవసాయదారులైనవారు ప్రతిఒక్కరుగూడా, యిటువంటి వుపన్యాసాన్ని వినినట్లయితే, దీనిని అభినందించకుండావున్న ఏ శాసన సభ్యుడైనను గ్రామాలకు వెళ్లినప్పుడు, వారిని తప్పకుండా విమర్శిస్తారనిన్నీ, నిందిస్తారనిన్నీ గూడా నేను గట్టిగాచెప్పగలను. ఈ ఉపన్యాసములో మన ఆంధ్ర దేశమును అభివృద్ధిపరచే విషయములు చాలావున్నవి. కాబట్టి యిటువంటి ఉపన్యాసము యిచ్చినందుకు గవర్నరుగారిని అభినందించటానికి ఎవరూగూడా వైనుకంజవేయరని నేను నమ్ముతున్నాను. నేను ఈ అవకాశంలో కొన్ని సూచనలు తమద్వారా మంత్రివర్గానికి తెలియచేయుచున్నాను. ముఖ్యంగా నందికొండ ప్రాజెక్టు ప్రారంభించబోతున్నారని ప్రజలకు చాలా సంతోషముకలిగింది. నేను కృష్ణా జిల్లా తిరువూరు నియోజకవర్గమునుంచి ఎన్నుకోబడ్డాను. అక్కడ ప్రజలందరికి ఆ ప్రాంతము అంతయు నందికొండ ప్రాజెక్టు క్రిందకువస్తుందని సంతోషంగాయున్నది. నందిగామ తాలూకాలో సుమారు రెండులక్షలయాభైవేల యకరాలభూమి సాగులోకి రాగలదని చీఫ్ యింజనీరుగారు యీ మధ్య ఒక ప్రకటనచేశారు. అందువల్ల తిరువూరు దానిచుట్టు ప్రాంతము అంతయుగూడా యీప్రాజెక్టు క్రిందకు వస్తుందని ప్రజలు ఆశిస్తున్నారు. అయితే అక్కడవారికి దీనివల్ల క్రొత్త బాధలు కనబడుతువున్నవి. ఇప్పటికి 3, 4, 5 సంవత్సరాలుగా ఆ ప్రాంతములో మధ్యరకమైన 4,5 irrigation projects ను కట్టించడానికి estimates తయారుచేయబడి ప్రభుత్వంవారు వాటికి డబ్బు, estimates శాంక్షనుచేసే పరిస్థితులలో నిల్చియున్నవి. ఈ ప్రాజెక్టులలో రెండు మూడు చాల ముఖ్యమైనవి. అందులో ఒకటి రాకట్టు అనేది వున్నది. ఈ రాకట్టు తిరువూరు గ్రామానికి నాలుగు మైళ్ల దూరములో ప్రస్తుతం హైదరాబాదు ప్రభుత్వం క్రింద ఉన్న పడమర వాగుమీద కట్ట బడినది. ఆవాగుకు ఒక డాముకట్టి, ఆ డాము ద్వారా తిరువూరులోవున్న ఏడు చెరువులకు నీరు సప్లయిచేయడం జరుగుతూవచ్చింది. అయితే యీ వ్యవహారము యిప్పటిదికాదు. ఈ తిరువూరు ప్రాంతమంతయు ఒకప్పుడు హైదరాబాదు నవాబు క్రిందవుండివున్నది. అప్పుడు ఈ పడమటివాగు మీద డాము కట్టబడినది. సుమారు 150, 200 సంవత్సరాల క్రిందట హైదరాబాదు ప్రభుత్వము చేసిన ప్రయత్నమిది. డాం నిర్మాణము చేయబడినట్లు ఈ డాంద్వారా తిరువూరులోవున్న ఏడుచెరువులకు నీరుసప్లయి చేయబడినట్లు కనబడుతూంది. ఇప్పుడు ఆ డాము కట్టడములన్నియు పనికిరాకుండా చెడిపోయినవి. ఆశిథిలాలు యింకను కనబడుతున్నవి. ఇప్పటికి సుమారు నూరు సంవత్సరాలుగా యీ పనిజరిగిపోయినట్లు గుర్తులు కనబడుచున్నవి. ఈ తిరువూరు ప్రాంతమంతయు తరువాత జమీందార్ల చేతులలోకివచ్చినది. జమీందారీ ప్రాంతము అయినా సక్కర్ క్రింద లేనందువల్ల జమీందార్లుకూడా యీ డాం కట్టించడానికి ఏమాత్రము ప్రయత్నించలేదు. ఆ నాటినుంచి గూడా నీరు సప్లయి సరిగా కాకపోవడమువల్ల, ఆ చెరువుల క్రింద రైతులు చాలా యిబ్బందులు పడుతూవచ్చారు. 1948 వ సంవత్సరము Zamindari Abolition Act అమలులోకి వచ్చింది. తరువాత యీ జమీందారీలను ప్రభుత్వము స్వాధీనపరుచుకున్నారు. అప్పటినుంచిగూడా అక్కడి రైతులు [illegible] భూములకు నీటిపారుదల సౌకర్యాలు కల్గించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూవస్తున్నప్పటికిన్నీ, ప్రభుత్వం ఏవిధమైన సౌకర్యాలు కలుగచేయలేదు. అయితే హైదరాబాదు ప్రభుత్వముమీద [illegible]

చర్య తీసుకున్న సమయములో తమంతట రైతులందరు చందాలువేసుకొని, కాలువలు త్రవ్వించుకొని తాత్కాలికంగా నీరు సప్లయి అయ్యేటట్లు చేయించుకున్నారు. నీరు సప్లయి సరిగా కావటానికి, వాగుకు అడ్డముగా ప్రతిసంవత్సరం యిసుక బస్తాలువేసి, నీరును ఆపి కాలవలద్వారా పారుదల చేయించుకుంటున్నారు. ఈ విధంగా జరుగుతూవున్నప్పుడు మన ప్రభుత్వమువారు, హైదరాబాదు ప్రభుత్వమువారు మన యింజనీర్లు, హైదరాబాదు ప్రభుత్వపు యింజనీర్లు, మన కలెక్టరు, హైదరాబాదు ప్రభుత్వపు కలెక్టరు, వీరందరువెళ్లి అక్కడ సిథిలాలుగవున్న డాం కట్టడములు చూచి, అక్కడ పూర్వము డాం కట్టబడివున్నమాట నిజమే, దానిని బాగుచేస్తే, నీటిపారుదలకు సౌకర్యము ఏర్పడుతుందని నిర్ధారణ చేసి, అక్కడ మన ప్రభుత్వము డాం నిర్మించుకొనుటకు యీరెండు ప్రభుత్వాలమధ్యను ఒడంబడిక కుదిరినట్లు, జాయింటురిపోర్టులో సంతకాలుచేసి పంపినట్లు తెలుస్తున్నది. అప్పటినుంచి తిరువూరు నియోజకవర్గపు ప్రజలందరు యీ డాము త్వరలో వస్తుందని ఆశిస్తున్నారు. అయితే యిందుకు సంబంధించిన కొన్ని ఎస్టిమేట్లు యింకా పూర్తికాలేదని, కొన్నిటికి హైదరాబాదు ప్రభుత్వము శాంక్షను యింకను యివ్వలేదని చెబుతూవచ్చారు కాని వాస్తవ పరిస్థితి తెలియడములేదు. ఇప్పుడు యీ నందికొండ ప్రాజెక్టు నిర్మాణము నిశ్చయమైన తరువాత, యీ వాగుకు డాము కట్టించడము ఆపివేశారని తెలుస్తున్నది. ఇది చాలా విచారకరమైన విషయం. నందికొండ ప్రాజెక్టు వస్తే ఏ 10, 15 సంవత్సరాలకోగాని రాదు. కాని యీ డాము కట్టిస్తే, యిది వెంటనే వుపయోగపడగలదు. నందికొండ ప్రాజెక్టు వచ్చినా ఆ ప్రాంతములకు అంతత్వరలో నీరుపారుదల చేయిస్తారనే నమ్మకము కనబడదు. అట్లయితే అక్కడ రైతులు, ఎంతో డబ్బువ్యయముచేసి, కాలువలు త్రవ్వించుకొన్నప్పుడు యీ డాం కట్టించి నీరుపారుదల చేయించకపోతే చాలా నష్టపడుతారని చెబుతున్నాను. నందికొండ ప్రాజెక్టు ఏ 15 సంవత్సరాలకో పూర్తి అయినప్పటికికూడా, నీరుపారుదల ఆ ప్రాంతాలకు హైదరాబాదు ప్రభుత్వమువారి అనుమతిమీదనే రావలసియుంటుంది. ప్రథమ స్టేజిలో హైదరాబాదు ప్రభుత్వము వారు వారి ప్రాంతాలకు, వారి రైతులకు నీరుపారుదల అయ్యేటట్లు చూచుకుంటారు. తరువాత స్టేజిలోగాని యీ తిరువూరు ప్రాంతానికి నీటిపారుదలరాదు. రెండవ స్టేజిలో వారు కాలము పొడిగించినా పొడిగించవచ్చు. కాబట్టి సిద్ధముగా తయారైన స్కీములను ఆపుజేసి, ఎన్నడో రాబోయే దానికి ఆశించియుండడనడం సరియైనవిషయంకాదు. ఇందులకు రైతులందరు చాలా నిరుత్సాహ పడుతారని హెచ్చరిస్తున్నాను. ప్రభుత్వమువారు పన్నులు ఎక్కువచేసినను, పన్ను హెచ్చింపుకు, నీటి తీరువ హెచ్చింపుకు, అన్నిటికిగూడా హెచ్చురేట్లయినను యివ్వటానికి సిద్ధముగావున్నామని ప్రభుత్వానికి అక్కడి రైతులందరు వ్రాసియిచ్చారు. కావాలంటే, చందాలరూపములోగూడా కొంత యివ్వటానికి సిద్ధముగావున్నామని వ్రాసియిచ్చారు. కాబట్టి సిద్ధముగాయున్న యిటువంటి స్కీములకు estimates కూడ తయారు అయివున్నప్పుడు అవి ఆపుచేయకుండా sanction చేయమని తమ ద్వారా ప్రభుత్వానికి మనవిస్తున్నాను.

**Sri D. V. Subba Rao:**—అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగము మీద తేబడిన అభినందన తీర్మానమును బలపరచజాలక పోయినందుకు నేను చాలా విచారిస్తున్నాను. ఈ ఉపన్యాసము చాలా లోప భూయిష్టముగా వున్నది. మన దేశాభివృద్ధికి కావలసిన అనేక విషయాలను గురించి యీ ఉపన్యాసములో ఎటువంటి ప్రసక్తిగూడా లేకుండా వుండడము చాలా శోచనీయము.

ముఖ్యంగా కౌలుదారీ సమస్యను గురించి ఏమీగూడా చెప్పబడలేదు. క్రిందటి మంత్రివర్గములో శ్రీ విశ్వనాథంగారు మంత్రిపదవి స్వీకరించిన వెంటనే, కౌలుదారీ రక్షణ బిల్లు తేబోతున్నామని ప్రకటించారు. అప్పుడు ఆ బిల్లు, ఏ 15 రోజులలోనో నెలలోనో వస్తుందని ఆశించాము. త్వరలోనే ఆ బిల్లు ప్యాసు అవుతుందనికూడా అనుకున్నాము. కాని యింతవరకు ఆ బిల్లును తీసుకురాలేదు. ఇప్పటికి ఒక నెలరోజులకు పూర్వం ప్రధాన మంత్రిగావున్న జహ్వర్లాల్ నెహ్రూగారు గూడా యీ కౌలుదారీ రక్షణబిల్లు ప్రతి రాష్ట్రమునకు వర్తించేటట్లుగా చేయబోతున్నామని ప్రకటన చేశారు. ఈ ప్రకటన విన్నతరువాత దేశంలోని కౌలుదార్ల నందరిని భూస్వాములు తొలగించ ప్రారంభించారు. ఈ తొలగింపు మూలంగా, వారికి రక్షణలేకుండా పోవడమే కాకుండా వున్న జీవనాధారం కూడ లేకుండా పోతున్నది; పోయిందికూడా. ఈతడవ గవర్నరుగారి ప్రసంగములో కౌలుదార్లకు రక్షణయిచ్చే ప్రసక్తే లేకపోవడము శోచనీయంగా వున్నది. Eviction suits పడని రోజులేదు. నేను న్యాయవాది వృత్తిలో వున్నాను. నేను ఎన్నో సూట్లు వేయడము చూస్తున్నాను. రైతులు, కౌలుమీద జీవించేవారు, అదే ఆధారముగా పెట్టుకున్నవారు భయపడి పోతున్నారు. ఏరోజున eviction నోటీసు వస్తుందోననే భయము కలిగింది. ఈనాందార్లు, భూస్వాములు రైతులను తొలగిస్తారనే భయము పూర్తిగా ప్రబలిపోయింది. దావాలువేసి, డిక్రీలుపొంది, అమీనాను తీసుకొని వచ్చేసరికి, భూములను విడిచిపెట్టుతున్నారు కొందరు. ఎవరైనా పెంకెవాడువుంటె, ఆ సమయంలో వచ్చిన అమీనాను తన్నిపంపడముకూడా జరుగుచున్నది. ఇటువంటి అల్లర్లు జరుగుచున్నవి. కాబట్టి కౌలుదార్లకు ఎటువంటి రక్షణగూడా లేకుండా పోవడమువల్ల, వచ్చే సంవత్సరము మనకు యీ భూములు వుంటాయో లేదో అన్నే భయమువల్ల, భూములను బలముచేయడము కూడా లేకుండ పోతున్నది. ఒకవేళ ముందు సంవత్సరముకూడా మనకే వుంటుందని, ఆ కౌలుదారు భూమిలో పంట ఎక్కువగా పండించవచ్చునని, ఏ పదిబండ్ల మట్టినో పొలములో తోలితే, మరునాడే, నా చేతనే, వచ్చే సంవత్సరము నాలుగు బస్తాలకు ఎనిమిది బస్తాలు యిస్తే, పొలము దున్నుకో, లేకపోతే పొలము విడిచిపెట్టు, అని నోటీసు యిప్పిస్తున్నారు. ఈ పరిస్థితులన్నీ చూస్తే, కౌలుదార్లకు భూముల విషయములో ఏ విధమైన నమ్మకము లేకుండా బోతున్నది. పోనీ, భూములు విడుస్తామంటే, రోజులు మారిపోయినవి. పూర్వము లాగు నమ్మకముపోయింది. భూములు విడిచిపెట్టి, యింకొకరివద్దనుంచి భూమిని తీసుకుందామని ఆలోచించి, యింకొకరిని భూమి యివ్వమని అడిగితే, భూమిలేని వాడివి నీవు మక్తాలో బకాయిలేకుండా చెల్లించగలవా, బకాయిపడితే, నీవు ఏ ఆధారముమీద నాకు బకాయి చెల్లించగలవు, దానికి హామీ ఏమిటి అని అడుగుతున్నారు. మరొకరిని అడిగితే, నేను స్వయముగా వ్యవసాయము చేసుకుంటాను గనుక భూమి యివ్వడములేదు అని అనేక రకాల నాటకాలు ఆడుతున్నారు. ఇవన్నీచూస్తే, "శతకోటి దరిద్రులకు అనంతకోటి ఆలోచనలు" అన్నట్లు అనేక వుపాయాలతో మాట్లాడుతున్నారు. ఎవ్వరిని అడిగినాగూడా నీకు ఆస్తిలేదు, మేము భూమి యివ్వము, నీవు బకాయిపెట్టితే, మాకు అది వచ్చేవిధం ఏది ? అని అంటున్నారు. ఈ పరిస్థితులలో ఏకౌలుకో చేసుకొని జీవించేవాళ్లకు జీవనాధారం లేకుండాపోయింది. హామీ యివ్వమంటే, యీ కౌలుదార్లు హామీ ఎక్కడనుంచి తేగలరు? హామీ యివ్వటానికి భూమివుంటే, కౌలుకు భూమి నివ్వమని అడగడము ఎందుకు సంభవిస్తుంది? ఇది ఎట్లావున్నదంటే, భర్త తద్దినము పెట్టుతూ ఒక ఆవిడ "మా ఆయన బ్రతికివుంటే, వుదయానికే విస్తళ్ళు వేసివుండేవి" అని అన్నది. అంటే ఆ భర్త బ్రతికివుంటే, ఆయనకు తద్దినము పెట్టడము

(Sri D. V. Subba Rao) [26th April, 1955

ఎందుకు? ఎవరైనా భర్త బాగుంటే, తద్దినము పెట్టుతారా? కాబట్టి హామీ యివ్వటానికి భూమివుంటే కౌలుకు భూమిని యివ్వమని అడగడమునకు అవసరమే వుండక పోవునుగదా!

కౌలుదారుల రక్షణ విషయంలో ఒకచట్టం వెంటనే చేయాల్సిన అవసరం వున్నది. ప్రతి సమస్యమీద అఖిలభారత దృష్ట్యా సమగ్రంగా ఆలోచిస్తున్నాం అని ఒకటే జవాబు చెబుతున్నారు. చాల చిన్న సమస్యమీద అనవసరంగా కాలయాపన అవుతున్నది. యిది సమంజసమైన పనికాదు. రెండోది మద్యపాన నిషేధం సమస్య గురించి చాల చర్చ జరిగింది. మా పెద్దాపురంకు యీ రోజు ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు ప్లానింగు మంత్రి వెంకట్రావుగారు ఎలక్షను ప్రచారంకోసం వచ్చినప్పుడు కమ్యూనిస్టులు అధికారానికివస్తే అందరినీ కల్లుత్రాగించి తందనా లాడిస్తారన్నారు. కమ్యూనిస్టులు ఏనాడూ త్రాగుడు మంచిదని చెప్పరు. 35 లక్షల గీత కార్మికులను నిరుద్యోగులుగా మార్చిన యీ చట్టం వాస్తవానికి ప్రజలలో దురలవాటును పోగొట్టలేదు సరికదా అవినీతిని దొంగసారా తయారుచేయడాన్ని హెచ్చుచేసింది అని అలాంటి యీ చట్టాన్ని రద్దుచేయమని మాత్రమే కమ్యూనిస్టులు చెబుతున్నారు. నేను ప్రొహిబిషను కేసులలో ప్లీడరుగా పనిచేశాను. జరిమానాలు చెల్లించినప్పటికే, మామూలు ముడుపు మాదిరి చెల్లిస్తూ ఎప్పటి మాదిరిగానే దొంగతనంగా త్రాగడం జరుగుతున్నది. ఇలాగ ఆచరణ సాధ్యంకాని యీ చట్టం ఎత్తివేసినట్లయితే ex-tappers యొక్క unemployment పోతుంది. ఈ విషయంగురించి గవర్నరుగారి భాషణలో కనపడడం లేదు.

తరువాత పెనాల్టీల విషయం. క్రిందటి అసెంబ్లీలో పెనాల్టీలు రద్దుకావలెనని కోరారు. అందుకు వారికి నా అభినందనలు. అయినా యిప్పటికే పెనాల్టీలువిధిస్తున్నారు. శ్రీ గోపాలరెడ్డిగార్లు పెనాల్టీల రద్దుగురించి వుత్తరువులు జారీచేశామన్నారు. అందుకు సంతోషిస్తున్నాను.

తరువాత కమ్యూనిస్టులకు వోటుచేసిన రైతులపైన భూస్వాములు దౌర్జన్యాలు చేస్తున్నారు. తరువాత ప్లానింగు మంత్రిగారు పంపిన ప్రణాళికలు చూచాను. రైతులు ఐచ్ఛికంగా contribute చేస్తారు. ఈ కార్యక్రమం జయప్రదంగా చేయవచ్చు. రోడ్లు వేయడానికి land acquisition త్వరగా చేయాలి.

తరువాత హరిజనుల విషయం. కమ్యూనిస్టులకు ఓటుచేసిన హరిజనులను పొలాలకు రానివ్వకుండా అటకాయిస్తున్నారు. భూస్వాములు, ఎన్నికలు సక్రమంగా జరిగినవని చెబుతున్నారు. కనుక ఈ విషయం చెప్పవలసి వచ్చింది. ఏమంటే వేమవరంపల్లి అనే గ్రామంలో 500 వందలమంది హరిజనులలో ఒక్కరూ ఓటు చేయలేదు. అంటే ఎవరైనా వూహించగలరు, ఎన్నికలు ఎంత సక్రమంగా జరిగాయో! ఎవరో కొంతమందయినా ఓటు చేయాలికదా, అలాంటిది ఒకరూ ఓటు వేయలేదంటే అర్థం ఏమిటి? రాజకీయాలకు అతీతంగా ప్రజలక్షేమమే దృష్టిలో పెట్టుకుని నవసమాజ నిర్మాణానికి ప్రభుత్వం కృషిచేయాలి.

తరువాత మన దేశంలో విదేశ మందులవల్ల చాల ధననష్టం కలుగుతున్నది. ఏ దగ్గువచ్చినా స్ట్రెప్టోమైసిన్ యిచ్చేవారలలోనికి మారిపోతున్నారు. కరక్కాయ కషాయంతో కుదిరే రోగాలకు పెద్ద

మందులు అనవసరం. ఆయుర్వేదాన్ని తగినంతగా ప్రభుత్వం ప్రోత్సహించక పోవడంవల్ల యిదంతా జరుగుతున్నది. చివరకు ఈ గవర్నరు ప్రసంగాన్ని అభినందించడానికి వీలులేదని చెబుతూ విరమిస్తున్నాను.

**Sri M. R. Appa Rao**:—అధ్యక్షా, మన దేశములో elections స్వేచ్ఛగా జరిగినవని యితర దేశాల కమ్యూనిస్టు ప్రతినిధులుకూడ ఇక్కడకు వచ్చి చూచి వాటిని మెచ్చుకొనియున్నారు. కమ్యూనిస్టులు మా నూజివీడు నియోజకవర్గములో మా తాలూక కాంగ్రెస్ ప్రెసిడెంటును పొడిచారు. ఆ కేసు కోర్టులోవుంది. దానిని గురించి ఎక్కువగాచెప్పను. మా నియోజక వర్గములోని గొల్లపల్లిలో 5 ఏండ్ల పిల్లను 7 ఏండ్ల పిల్లవానిని తలకాయలు పగులగొట్టారు. కమ్యూనిస్టుల దౌర్జన్యాలవల్ల వారికే ఎక్కువ నష్టము కలిగింది. ఎన్నికలు ప్రజాస్వామ్య ప్రభుత్వ దేశాలలో శాంతియుతముగా జరుగగలవని చెప్పడానికి ఏ మాత్రము సందేహములేదు.

ముఖ్యంగా యీ ప్రసంగములో నందికొండ ప్రాజెక్టు చాల ప్రాముఖ్యము వహించినది. నందికొండ ప్రాజెక్టు ప్రత్యేకత ఏమటంటే వెనుకబడ్డ కృష్ణా, గుంటూరు జిల్లాలలోని భాగాలకు నైజామ్ జిల్లాలలో వెనుకబడిన ప్రాంతాలకు, నీటి పారుదల సరిగలేని ప్రాంతాలకును నీటి వసతి జరుగుతుంది. నూజివీడు తాలుకాలోకూడ రాయలసీమలోని పరిస్థితులేవున్నాయి. నందికొండ ప్రాజెక్టు క్రింద నూజివీడు, నందిగామ, తిరువూరు తాలుకాలకు నీరు లభించేటట్లు చూడాలి. ఇటువంటి పెద్ద పెద్ద ప్రాజెక్టులు కట్టినపుడు మన ప్రభుత్వము కొంత డబ్బు రాబట్టడానికి ప్రయత్నము చేస్తువుంటారు. ఎవరుచేసే భూములు వాండ్ల స్వాధీనములో వుండాలని అంటు వారిని తొలగగొట్టి ఆ భూములను వేలమువేసేటప్పుడు చాల అలజడి కలుగుతుంది. ఆ ప్రయత్నాలు చేయవద్దని నేను ప్రభుత్వముతో మనవిచేస్తున్నాను. ఇంకొకటి కృష్ణాకంతటికి చాల ప్రధానమైనది బుడమేరు ప్రాజెక్టువున్నది. బుడమేరుకు వరదవచ్చినప్పుడు చాల నష్టము కలుగుతుంది. దానివల్ల ప్రభుత్వానికి కూడ చాలనష్టము. కొన్ని లక్షలు ఖర్చుపెట్టినట్లయితే మైలవరం చెరువుకట్టి బుడమేటి నీటిని ఆ చెరువుకు త్రిప్పినట్లయితే యీ చెరువుక్రింద కొన్నివేల ఎకరాలు పొగగుతూంది. నూజివీడు తాలూకాకు current ఎక్కువగా కావలసివుంటుంది. బావులు చాలవున్నాయి. మొట్టమొదట ఒక బావికి 15 రూపాయల current ఉపయోగించితే current యిస్తామన్నారు. ఇప్పుడు 35 రూపాయలకు పెంచినారు. కనుక దీనిని 15 రూపాయలు చేయాలని ప్రభుత్వమును కోరుతున్నాను. Electricity మంత్రిగారికి ఒక petition కూడ యిచ్చాము. ధరలు పెరిగేవరకు యీ current రేట్లు పెంచకూడదని మనవిచేస్తున్నాము. కృష్ణాజిల్లాలో 14 high schools మూసివేస్తారని వింటున్నాము. ఎందుకంటె ఇవి self-sufficient కానందువల్ల. గొల్లపల్లిలో గ్రామస్థులు 20 వేలు కట్టి చేసిన వాగ్దానం నెరవేర్చుకున్నారు. Schools ను మూసివేస్తే ప్రజలు బాధపడుతారు. కనుక ప్రభుత్వంవారు schools ను ఆర్థిక కారణాలవల్ల మూసివేయకూడదని నేను మనవిచేస్తున్నాము.

ఇప్పుడు Prohibition వుంది. చీరానుంచి పంచదారను తయారుచేస్తామని మన మెంబరు వెంకటయ్యగారు సూచించారు. నూజివీడు తాలుకాలో తాటి, ఈతచెట్లు చాల ఎక్కువగా వున్నందువల్ల అక్కడ ఒక Factory పెట్టమని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను.

Sri K.V.S. Padmanabha Raju:—అధ్యక్ష మహాశయా, ప్రస్తుతము జరుగుచున్న చర్చలో పాల్గొనడానికి అవకాశమిచ్చినందుకు మీకు నా అభివందనాలు. ఈ రోజు మనము గవర్నర్‌గారి ఉపన్యాసముమీద చర్చిస్తున్నాము. కాని ఆంధ్రుల క్షేమానికి యీ రోజు ప్రథమ శాసనసభా సమావేశము జరుపుకుంటున్నాము. . గవర్నర్‌గారి ఉపన్యాసాన్ని అభినందించ నవసరము లేదని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా మనము ఒకటి గమనించాలి. ఆంధ్రలో ఎన్నికలు జరిగేటప్పుడు యీనాడు అధికారములోనికి వచ్చిన కాంగ్రెస్ పార్టీ ప్రజలముందు పెట్టిన ఒక సిద్ధాంతముంది. అవడి కాంగ్రెస్‌లో Socialist సమాజాన్ని స్థాపించబోతున్నామని ప్రకటన చేయబడింది. అదేవిధముగా అమాయకులైన ఆంధ్ర ప్రజలు Socialist సమాజము స్థాపింపబడుతుందని నమ్మి మిమ్మలను అధికారములోనికి తీసుకరావడము జరిగింది. నేనుకూడ నిజమేమో అని అనుకున్నాను. Socialist సమాజము ఎంతవరకు జరుగుతుందో చూద్దామని అనుకునేవాడను. ఒకటికూడ యీవేళ Socialist సమాజపద్ధతులపై నడవడములేదు. కాంగ్రెస్ తాత్కాలికంగా అధికారములోనికి వచ్చింది. ఫలానా విధంగా కాంగ్రెస్ policy వుంటుందని సూచించలేదు. గవర్నర్‌గారి ఉపన్యాసము తీసుకుంటే అందులో ఏ ఒక్కటికూడ Socialist ప్రాతిపదిక మీద లేదని మనవిచేస్తున్నాను. ఆ కారణముచేత వారిని అభినందించలేక పోతున్నాను.

చాలా సంవత్సరములనుంచి ఆంధ్ర దేశంలోవున్న ప్రధాన సమస్య ఈనాముల సమస్య. జమీందారులు రద్దుఅయిన తరువాత ఈనాములు రద్దుకావాలి అనే fundamental policy తీసుకోకుండా దానిమీద సరియైన చట్టం చేయకుండా 'as early as possible' అని చెబుతున్నారు. ఆంధ్రలో నూతన ప్రభుత్వం స్థాపించినతరువాత గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రిగా, చంద్రమౌళిగారు రెవెన్యూ మంత్రిగా అధికారంలోనికి వచ్చినాక శాసనసభా సమావేశానికి ముందుగానే ఈనాము రైతులకు రక్షణ కలుగచేస్తారని ఆశిస్తూ వచ్చాము.

The Hon. Sri K. Chandramouli:—చేస్తాము. కొంచెము time కావాలి.

Sri K. V. S. Padmanabha Raju:—ఈనాము సమస్యమీద ఆంధ్రదేశంలో సోషలిస్టుపార్టీ ఆధ్వర్యాన ఒక ఉద్యమం జరిగింది. గోపాలరెడ్డిగారు Provincial Congress Committee President గా 'ఈనాము సమస్య ప్రధానసమస్య, దానిమీద మన పాలసీ ఇవ్వాలి' అని ప్రత్యేక సమావేశం జరిపి, ఒక పాలసీ ఇచ్చారు. వారుఇచ్చిన పాలసీ గత ప్రభుత్వం అమలు జరుపవలసి యుండెను. కాని అమలు జరుపలేదు. గోపాలరెడ్డిగారు నేడు ప్రధాన మంత్రిగావున్నారు; దాన్ని అమలు జరుపవలసిన moral binding ఆయనమీద వున్నది. కాని గవర్నరుగారి ఉపన్యాసంచూస్తే ఈనాము సమస్యకూడా land reforms తో కలిపివేయబడింది. దీన్ని ఈవిధంగా కాలయాపన చేస్తుంటే ఎంతోమంది రైతులు భూములనుంచి వెళ్లగొట్టబడుతున్నారు. ఎప్పటికి ఈ సమస్య పరిష్కరిస్తారు? ఏవిధంగా రక్షణ కల్పిస్తారు? కరివెన గ్రామంలో జరిగింది ఉద్యమం. కాంగ్రెసు పార్టీలోవున్న శాసనసభ్యులకుకూడా అసలు సంగతులు తెలుసు. ఇటువంటి ప్రధానమైన సమస్యపై సరియైన సిద్ధాంతాలు లేకుండా చట్టాన్ని పాసుచేయకుండా ఏదో సోషలిస్టు సమాజంవైపుకు పోతున్నాము అనడం అర్థంకావడంలేదు. సోషలిజానికి అసలు ప్రాతిపదికలేకపోతే ఎంతవరకు సోషలిజం తీసుకురాగలము? నిన్నటిలోజున చాలామంది సభ్యులు మాట్లాడారు;

26th April, 1955] (Sri K.V.S. Padmanabha Raju)

ప్రభుత్వ సభ్యులుకూడా చెప్పారు. భగవంతరావుగారు చెప్పారు. Socialist pattern of society అనేదానిలో చాలా భేదాభిప్రాయాలు వున్నట్లు ప్రభుత్వ సభ్యుల ప్రసంగాలే తెలియచేస్తున్నవి. ఈనాముల సమస్య resolution రూపంగా పెట్టి తప్పని సరిగా తీసుకోవాలని గోపాలరెడ్డిగారిని కోరుతున్నాను. భారతదేశంలో ప్రధానమైన ప్రాజెక్టు అయిన నందికొండ తీసుకువచ్చినందుకు విశాఖ పట్నం, శ్రీకాకుళంజిల్లా ప్రజలతరఫున సంతోషం తెలియచేస్తున్నాను. ఇటువంటి పెద్ద ప్రాజెక్టే కాకుండా 40,50 లక్షలతో తయారయే చిన్నప్రాజెక్టులు backward areas లో ఎన్నోవున్నాయి. వాటినికూడా తీసుకోడానికి ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. మళ్లీ ఇటువంటి వాటిని తీసుకువచ్చి మమ్మలను సంతృప్తిపరుస్తారని ఆశిస్తున్నాను.

Sri N. Sambhu Reddi:— అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగాన్ని నేను బలపరుస్తున్నాను. నందికొండ ప్రాజెక్టుకు సంబంధించిన ఏర్పాట్లు పూర్తిగా చేయించి ఆపని ప్రారంభం అయేదానికి కృషి చేసినందుకు వారిని అభినందిస్తున్నాను. రాయలసీమ ప్రజలు నందికొండ ప్రాజెక్టును వ్యతిరేకిస్తున్నారు; దానినిగురించి కొంత అసంతృప్తి ప్రకటిస్తున్నారు అనుకోడం అన్యాయం అని మనవిచేస్తున్నాను. ఆకలి బాధతో బాధపడే రాయలసీమ ప్రజలు శాసనసభ్యులు అందరూ బాధపడుతున్నారని కాదు నేననేది; సామాన్య ప్రజలసంగతి నందికొండ వంటి మహత్తరమైన ప్రాజెక్టును వ్యతిరేకిస్తారనుకోడం పొరపాటని మనవిచేస్తున్నాను. నందికొండ ప్రాజెక్టుతోపాటు తుంగభద్ర ఎగువకాలువకూడా వస్తే మేము చాలా సంతోషించేవాళ్లము. అందుకు కూడా కృషిచేస్తామని గవర్నరుగారి addressలో వున్నది కాబట్టి తాత్కాలికంగానైనా తృప్తిపడుతాము. కమ్యూనిస్టు పార్టీవారి తరఫున 'ప్రజాస్వామ్య కూటమివారు చాలా అన్యాయాలు చేశారు. అన్యాయాల వల్లనే ఎంతోమంది ఎన్నిక అయినారని' ఆరోపణచేసారు. విశాలాంధ్ర సంపాదకులు ఎన్నికలు జరిగిన నాలుగైదు దఫాలుగా సంపాదకీయం వ్రాస్తూ ఆంధ్రదేశంలో పేద ప్రజానీకం భూస్వామ్యకూటమి దౌర్జన్యాన్ని ధిక్కరించి ఏకోచితంగా నిలిచి అభ్యుదయగాములైన కమ్యూనిస్టులకు వోటు చేసారని ప్రజాసామాన్యాన్ని అభినందించారు. దేశంలో పేద ప్రజానీకం యావత్తు కమ్యూనిస్టుపార్టీకే వోటుచేసినట్లు, కమూనిస్టుపార్టీ ఒప్పుకున్నప్పుడు ఓడిపోయిన అనంతరం ఆ ప్రజలు వోటు చేయలేదని చెప్పకోడం సరిగాలేదని మనవిచేస్తున్నాను. ఈ రకంగా చెప్పడం ఆంధ్ర రాష్ట్రంలో ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలని బ్రహ్మాండమైన ఉత్సాహంతో పని చేసిన తరువాత ఓడిపోవడంవల్ల కేడర్లలో అసంతృప్తి ప్రబలి నిరుత్సాహం కలుగడంవల్ల నిరుత్సాహాన్ని పోగొట్టడానికి చేసే ప్రయత్నంతప్ప మరొకటికాదు. ఒక చిన్నవిషయం ప్రభుత్వం వారికి సూచించ తలచుకున్నాను. కడప జిల్లాలో ఏటికాలువలు వున్నాయి. అయిదారు సంవత్సరాల క్రితం అనంతపురంజిల్లాలోని ఏటికాలువల విషయమై ప్రజలు ఒక తీర్మానం చేశారు. K.C. కెనాల్, కృష్ణ, తుంగభద్ర నీళ్ళనిచ్చే భూములపై నీటితీరువ వేయుడంలో ధర్మంవున్నది. ప్రభుత్వం కొన్ని కోట్లు ఖర్చుచేసినది కాబట్టి ఖర్చు ప్రతిఫలం ఆశించడంలో అర్థంవున్నది. రెండు ఎకరాలకు ఒక మనిషి చొప్పున ప్రతిరైతు ఏటికాలువ త్రవ్వడానికి పోవాలి. ఎకరానికి రు. 30 లు అదనంగా ఖర్చు చేసుకోవాలి. ఎకరానికి రు. 30 లు ఖర్చు చేయడం ఇతర ప్రాజెక్టుక్రింద రైతులకు లేదు. ప్రతి ఎకరానికి రు 30 లు ఖర్చుచేయాలి, కాబట్టి నీటితీరువ రు 14,15 లు వేయడం సబబు

అయినదికాదు. రైతుకష్టంమీద ఆధారపడింది కాబట్టి ఏటికాలువలకు పన్ను తీసివేయాలని మనవి చేస్తున్నాను. ఇక రు 10 లు పన్నువిషయం, రు 10 ల పన్ను తగ్గించాలి అని ప్రతి పేదరైతు కోరుకుంటాడు. దీనినికూడా ప్రభుత్వం తప్పకుండా అమలు చేస్తారని ఆశిస్తున్నారు. వాణిజ్య పంటల ధరలు పడిపోతున్నాయి. రు 7,8 లు వుండే వేరుశెనగ రు 2½,3 లు అయినది. ఈ రకంగా ధరలు పడిపోవడంవల్ల రైతులకు విపరీతమైన నష్టంకలుగకుండా ప్రభుత్వం సాకల్యంగా ఆలోచించి అన్ని రకాల సదుపాయాలు కలుగచేస్తారని ఆశిస్తూ రాజేశ్వరరావుగారి తీర్మానాన్ని బలపరుస్తూ విరమిస్తున్నాను.

* Sri B. Rama Reddi :—గౌరవనీయ అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగంగురించి మాట్లాడే ముందు, నేను ఒకవిషయాన్ని మనవిచేయదలచాను. మాలో చాలామంది శాసనసభకు ప్రథమంగా ఎన్నికకాబడి వచ్చినవారము కాబట్టి, ఇక్కడ ప్రథమంగా బాగా మాట్లాడవలెననేటటువంటి క్రొత్తమోజు ఒకటి ఉన్నది. ఎన్నికల సమయంలో, గంటలకొలది మాట్లాడుచుండేవారము. అటువంటి వారము ఇక్కడ కొద్దికాలములో ఉపన్యాసము ముగించవలెనంటె భయంగా ఉన్నది. అందులో మీరు time అయిపోయిందని గంటకొట్టితే మేము తికమకపడి మేము చెప్పదలచుకొన్న దంతా కలగాపులగంగా అవుతుంది. కనుక మాకు కొంచెము ఎక్కువ వ్యవధి ఇవ్వవలెనని ప్రార్థిస్తున్నాను.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ప్రప్రథమంగా ఎన్నికలు జరిగాయి. ఈఎన్నికల నిర్వహణలో ప్రభుత్వోద్యోగులు కనపరచినటువంటి కార్యదీక్షనుగురించి గవర్నరుగారి ప్రశంస ఎంతయో ఆమోద యోగ్యముగా ఉన్నదని నేను హర్షిస్తున్నాను. కాని ఎన్నికలలో ఏవైనా తప్పలు జరిగాయని అంటే, అవి కేవలం అభ్యర్థులు అక్కడక్కడచేసిన అవకతవకలవల్లనే జరిగియుండవచ్చును కాని ప్రభుత్వోద్యోగుల వల్లకాదు. అందుకు వారిని నిందించడం సబబుకాదు. ముఖ్యంగా అభ్యర్థులకు, ఏపార్టీకి చెందినవారైనప్పటికినీ, ఎన్నికలలో నెగ్గాలనే ఆకాంక్ష ఎక్కువగా ఉంటుంది. అటువంటప్పుడు, ఏవో కొన్నిపరిస్థితులలో అవకతవకలు చేయకతప్పదు. అవిధంగా చేసిఉంటారు. ఏపార్టీవారైనా వరే గుండెపైన చేయివేసుకొని, " మేము ఎన్నికలలో నిలబడి సక్రమంగా చట్టబద్ధంగా ప్రవర్తించి గెలిచాము " అని చెప్పగలరా అని అడుగుతున్నాను. ఒకవేళ అటువంటి వారెవరైనా ఉండినట్లయితే, అది చాలా ఆశ్చర్యపడవలసిన విషయమేనని మనవిచేస్తున్నాను. ఎన్నికల పరిస్థితి ఆవిధంగా ఉన్నప్పుడు వీరిపైన వారు, వారిపైన వీరు ఏదేదో చెప్పకోవడం అంటే కుందేటి కొమ్ములుకోసం వెదుకుతున్నట్లుగా ఉంటుంది. ఈ సందర్భములో ఒక కమ్యూనిస్టు సోదరుడు పోలీసువారు యేవో అత్యాచారాలు చేశారని చెప్పతూ ఒక ఉదాహరణం చెప్పారు. మన ముఖ్య మంత్రిగారితో చెప్పతూ, పెండ్లికి బంధువులను తమ్మని బంట్రోతులచేత గెంటించడం సబబా అని అన్నారు. కాని, 'వచ్చినవాళ్లు మర్యాదగా ఉంటేసరే, లేకపోతే వారిని గెంటించక ఏమిచేస్తారు' అని నేను మనవిచేస్తున్నాను. కనుక ఎవరైనా చట్టబద్ధంగా ఉంటేసరే, చట్టాన్ని వ్యతిరేకించి, దాన్ని అతిక్రమించినప్పుడు, ఏమైనా జరుగవచ్చు. గవర్నరుగారి ప్రసంగములో ప్రస్తావనచేసిన విషయాన్ని బట్టిచూస్తే, ప్రభుత్వోద్యోగులు ఎన్నికలు ఏవిధముగా నిర్వహించినారో అనే విషయము గురించి మాత్రమే చెప్పారు. ఇదివరకు కొంత కాలము గవర్నరు పరిపాలన ఉండి, ఇప్పడే ప్రజాప్రభుత్వము ఏర్పడినది. ఈ ప్రభుత్వము ప్రజలకు ఏమిమేళ్లు కలుగచేస్తుందో చూడవలసియున్నది. ఇప్పడే దాన్నిగురించి ఏమీచెప్పవలసిన అవసరంలేదు. అదేవిధంగా, గవర్నరుగారి పరిపాలన అక్షేపణీయమైనదిగా లేదని నేను అనుకొంటున్నాను.

తరువాత, 10 రూపాయల శిస్తు మినహాయింపు, బంజర్ల పంపకం విషయంగురించి మాట్లాడవలసి వచ్చినప్పుడు, నందికొండ ప్రస్తావన తెచ్చిపెట్టి, పెద్దలు శ్రీ అయ్య దేవర కాళేశ్వర రావుగారు, శ్రీమతి అమ్మన్నరాజాగారు రాయలసీమ ఆంధ్రమన స్తత్వాలు అప్పడే ఉపన్యాసాంలో బయల్పడు చున్నవని చెప్పారు. వేదాంతోపన్యాసాలు చేయడం చాలా సులభమే. దెబ్బతగిలిన వాడు ఏడుస్తూవుంటే ప్రక్కనున్నవాడు "ఎందుకురా ఏడుస్తావు ఆ మహాదెబ్బకేనా ఏడ్చేది" అన్నాడట. దెబ్బతగిలినవాడికి కదా ఆనొప్పి తెలుస్తుంది. ఇతరుల కేమితెలుస్తుంది? ఇప్పుడు రాయలసీమకు కదా దెబ్బ తగులుతుంది. కనుక వారు ఏడ్వక ఏమిచేస్తారు? అంతేకాదు, ఇటువంటి చిన్న చిన్న విషయములలోకి పోకూడదని చెప్పినటువంటి కాళేశ్వర రావుగారు సైతము మళ్లీ తమ బెజవాడ సంగతి వచ్చేటప్పటికి అక్కడ drainage scheme కావలెనని చెప్పవలసిన పరిస్థితి ఏర్పడింది. కనుక ఎవరికైనా "తన్నుమాలిన ధర్మము, మొదలు చెడ్డబేరము" ఉండదు. శాసన సభ్యులందరు ఆంధ్రరాష్ట్రానికంతకు సమష్టిగా బాధ్యులేనని ఒప్పుకొన్నప్పటికీ, వ్యక్తిగతంగా తన నియోజక వర్గమునకు ప్రతి శాసనసభ్యుడు ప్రత్యేకంగా బాధ్యుడుగా ఉన్నాడు అన్నవిషయము ఈ విమర్శ చేసేవారు మరచి పోకూడదని మనవి చేస్తున్నాను. ఈ పదిరూపాయల శిస్తు మినహాయింపువల్ల కలిగేలాభము సాధారణ ముగా రాయలసీమ ప్రజానీకానికే విశేషంగా ఉంటుంది. అటువంటిది ఇప్పుడు పోయింది. తరువాత నందికొండ ప్రాజెక్టువల్ల కలిగే లాభము సర్కారుజిల్లాలవారికే కనుక రాయలసీమ వారికి ఏలాభములేక పోయింది. గవర్నరుగారి ప్రసంగంలో నందికొండ ప్రాజెక్టుతోపాటు సిద్ధేశ్వరం ప్రాజెక్టుకూడ కొంత ప్రస్తావించిఉంటే రాయలసీమకు సంతోషము కలిగిఉండేది. కాని దానివిషయంగురించి ప్రస్తావించలేదు. ఈ పదిరూపాయల శిస్తు వసూలు మాఫీచేయకుండా ఉండడంవల్ల కలిగే బాధ మాకువచ్చింది. కాని దానివల్ల కలిగే లాభము సర్కారువారికి పోతూవున్నది. అయితే దేశవ్యాప్తంగా, అందరుచూచి ఆనం దించవలసిన విషయమది అంటారేమో! ఇది ఎట్లున్నదంటే, అవయవాలన్నిటికంటె ప్రధానంగా ఉన్నటు వంటి తలను సర్వాలంకారభూషితంగాచేసి క్రిందంతా bare body గా ఉంటే, ఏ విధంగావుంటుందో ఆ విధంగా వున్నదిది. ప్రజలు అతనిని పిచ్చివాడనుకొంటారు, కనుక ఇతర అంగములన్ని అందంగా ఉండి ఒకఅంగం వికారంగా ఉండినప్పటికీ ఏవిధంగా వికలాంగుడని పిలువబడతాడో అట్లనే, అన్ని సౌకర్యాలు కలిగిన వారికే, ఇంకా ఎక్కువ సౌకర్యాలు కలిగించి వెనుకబడిన వారి సౌకర్యాలగురించి విచా రించకుండినట్లయినచో మన రాష్ట్రంకూడ అంగవిహీనంగా కన్పిస్తుంది. నందికొండవల్ల అనేక లక్షల ఎకరాలు సాగవుతుంది కదా, దానివల్ల మీకు ధాన్యము సులభంగా లభిస్తుందికదా అంటే, దానివల్ల కోస్తా జిల్లాలవారికి లాభముకాని, మాకేమిలాభము. ధాన్యం కొనకుండా మేమే పండించుకుంటేనే మాకు నిజమైన సంతోషము. కనుక ఈ వేదాంతోపన్యాసాలవల్ల మాకేమి ప్రయోజనంలేదు. ఈ సందర్భమున వాకొకటి జ్ఞాపకం వస్తున్నది. "అన్నమైతే నేమిరా మరి సున్నమైతేనేమిరా, అందుచేతనే ఈ పాడుపొట్టకు అన్నమే వేతామురా" అన్న మాసిద్ధయ్యగారి వేదాంతము జ్ఞాపకం వస్తున్నది.

Srimathi C. Ammanna Raja:—Sir on a point of personal explanation. ఆవిధంగా చెప్పిన అమ్మన్న రాజాకు ఒక ఎకరాభూమిలేదు [illegible]

Sri B. Rama Reddi:—[illegible] ఈ పెద్ద ప్రాజెక్టువల్ల రాయలసీమకు ఏమిలాభంలేదు. [illegible] పెద్ద ప్రాజెక్టులు కట్టినప్పటికి అక్కడ ఏలాటి లాభంలేదు. మేము [illegible]

(Sri B. Rama Reddi) [26th April, 1955

పడవలసియున్నది. ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో "బావులు" అని heading ఉన్నది కాని private బావులకు సగము contribution ఇవ్వడం లేదని ప్రభుత్వంవారు చెప్పతున్నారు. అట్లు కాకుండా, private wells కు కూడ సగం contribution ఇవ్వవలసిందని మనవిచేస్తున్నాను.

మా ప్రాంతములో చిన్నచిన్న నదులున్నవి. మా తాలూకాలో తడుకువాగు ప్రాజెక్టును గురించి దాదాపు 4,5 సంవత్సరములుగా ప్రభుత్వదృష్టికి తెస్తున్నాము. P.W.D. వారుకూడ రాయలసీమలో అటువంటి మంచిప్రాజెక్టు వేరేలేదని అంటున్నారు. ప్రభుత్వము 47, లక్షలు ఖర్చు పెట్టినట్లయితే 4.7 % return ఇస్తుందని చెప్పచున్నారు. అటువంటిదాన్ని తీసుకోడానికి ఏలాటి ప్రయత్నం జరుగలేదు.

ఇక బీదలకు బంజరుభూములు ఇచ్చే విషయంలో బీదహరిజనులకు, సర్వే రాళ్ల ఖరీదుకూడ ఇవ్వలేనటువంటివారికి, కేవలం సామాన్యమైన ధరలకు బంజరుభూములు ఇవ్వవలసిందని కోరుచున్నాను.

ఈ పన్ను తగ్గింపు, బంజరుభూముల పంపకము చేస్తామని చెప్పడంవల్ల రాయలసీమలో అఖండ విజయము ఐక్యకాంగ్రెసు సంఘము సంపాదించగలిగింది. అంతేకాని మరేకారణముచేతనూ గూడా కాదని అంటున్నాను. కాని యిప్పడుప్రభుత్వము యీ 10 రూపాయలపన్ను తగ్గింపును తీసివేస్తే, ప్రజానీకం యింతవరకు దీనివల్లపడిన సంతోషమును తగ్గించినట్లవుతుంది. వారు నిస్పృహ చెందుతారని మనవిచేస్తున్నాను.

అంతేకాదు, చెరువుతట్టు బంజరుభూముల విషయములో హరిజనులకు చాలా అన్యాయము జరుగుచున్నది. వెనుక అధికాహారోత్పత్తి విధానంలో ప్రభుత్వమువారు హరిజనులను ప్రోత్సాహించారు. కాని ఈ నాడు యీ చెరువుతట్టు బంజరుభూములకు ప్రక్కగావున్న రైతులకు పట్టాలు యిచ్చారు. ఈ రైతులకు పైప్రక్కనవున్న భూములను హరిజనులు సాగు చేసుకుంటూవుంటే, ఆ భూముల విషయంలోమాత్రం వారికి పట్టాలు యివ్వబడలేదు. రైతులకు పట్టాలు యిచ్చినందువల్ల వారు సాగుచేసుకోటానికి హక్కుకలిగింది, పట్టాయివ్వకుండావున్న భూములను, ప్రక్కనే వున్నప్పటికిని, అవిప్రభుత్వమువారు పోరంబోకుల క్రింద బంజర్లుగా treat చేయడమువల్ల హరిజనులకు ఇచ్చుకోలేనంత penalties వేస్తున్నారు. హరిజనులు యీ penalties కట్టలేక చాలా బాధపడుతున్నారు. కాబట్టి యీ విషయముకూడ మీ ద్వారా ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. ఇంకను ఎన్నోవిషయములు వున్నప్పటికివి; నేను వాటినిగురించి చెప్పటానికి వ్యవధి లేదు. కనుక వీడివెట్టున్నను యీ సమయములో గవర్నరుగారి ప్రసంగం కొంతమటుకు కొన్ని విషయాలలో ఆమోదకరంగానే వున్నదని చెబుతూ నేను యింతటితో విరమిస్తున్నాను.

MR. SPEAKER:—The House will now adjourn for lunch and meet again at 3 p.m.

AFTER LUNCH—3 p.m.

MR. SPEAKER:—The House will now resume discussion on the Governor's address.

26th April, 1955]

Sri M. Rangayya:—Mr. Speaker, Sir, I rise to support the resolution of Mr. Rajeswara Rao, thanking His Excellency the Governor for his address I beg to be excused for this occasion if I speak in English. I have chosen to speak in English, not that I cannot speak in Telugu, but that I feel on this occasion I can give expression to my thoughts better in English than in Telugu. So my friends will pardon me for this time, and from next time I shall try to speak in Telugu.

We are all deeply grateful to His Excellency the Governor for the keen personal interest he has taken in the Nandikonda project. He has got it included in the First Five Year Plan and he has made a good beginning, in that the road is being formed from Macherla to the damsite. For this, we, Andhras, are all deeply grateful to him. In the address there are several things. But I wish here to speak only on two things.

Our friends on the other side feel that the recent elections have not been fair and peaceful. It is natural that they should feel so, because they expected that the results would be otherwise, and when they were sorely disappointed, they say that the elections were not fair and peaceful. Throughout Andhra everyone feels that the elections were not only fair but peaceful also. But in Nuzvid and Divi constituencies there was a lot of violence. For that, we on this side are the least responsible. It is those who were disappointed that were responsible for that violence.

Next, some friends feel that the Address is not quite satisfactory in that the socialistic pattern of society has not been envisaged. It is true there is no reference to it. But I am not disappointed about it. I am rather a patient man. So I ask my friends not to be impatient. The Congress Organisation and the Congress leaders are determined to have a socialistic pattern of society in our land. We as Congressmen are determined to have it. Here I would remind my friends to remember one thing. Rome was not built in a day. And so if socialistic pattren of society is not immediately possible, the foundations for it were laid long long ago by some of our revered leaders, as in the abolition of zamindaris, in the abolition of inams and in their projected land reforms. These are strong foundations for the future socialistic pattern of society. I ask my friends on the

other side to remember how many years Russia took to build up their socialistic pattern of society. Not merely that; what is good for Russia may not be good for India. In Russia they have attained it through violence. But we in India are going to attain it in a non-violent way, on Gandhian lines. So I ask my friends on the other side to be patient. They need not frequently taunt us by saying that there is nothing socialistic in the coming reforms. With these words, I again thank his Excellency the Governor for the kind address he has given.

*Sri D. Kondayya Chowdari:—అధ్యక్షా, శ్రీ రాజేశ్వరరావుగారు తెచ్చిన అభినందన తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను. నందికొండ ప్రాజెక్టువల్ల నెల్లూరుజిల్లాలోని కందుకూరి తాలూకా పూర్తిగా benefit పొందుతుందని అంటున్నాను. ఈ విషయములో ప్రభుత్వమువారు తక్షణ చర్యలు తీసుకుంటున్నందుకు నేను ముందుగా ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను, ఈ విషయము గవర్నరుగారి ఉపన్యాసంలో చెప్పబడింది గనుక నేను రాజేశ్వరరావుగారు తెచ్చిన యీ అభినందన తీర్మానమును బలపరచడమవుతున్నది. అయితే పేదవారికి భూములనిచ్చే విషయములో అనేకమంది మాట్లాడియున్నారు. నేనుగూడా కొన్ని విషయాలు మాట్లాడుతూ కొన్ని సూచనలు ప్రభుత్వమువారికి నివేదించ దలచుకున్నాను. బంజరుభూములు రెండురకాలుగా వుంటున్నవి. మొదటిరకము భూములు పేదవారి చేతులలో సాగుఅవుతూ, శివాయి జమా భూములయి ఆక్రమణలోవుండి సాగుకు లాయకీగా ఎక్కువ అభివృద్ధిపరచబడి ఫలితానికి సిద్ధముచేసి పంటలు పండించుచున్న భూములు; ఇక రెండవ రకపు భూములు, ఎవరి స్వాధీనములో గూడా లేకుండా బంజరుగావుండే భూములు. కనుక యీ విధంగా యీ బంజరు భూములు రెండు రకములుగా వుంటూవున్నవి. ఈ రెండురకాల భూములున్నూ, ఒకే దృక్పథముతో చూడవద్దని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. అట్లు చేయుట సబబుగ లేదనిగూడా నా అభిప్రాయము. ఇందులో యిదివరకు ఆక్రమణలో ఉన్నభూములు యివ్వడములో నేను ఒక సలహా ప్రభుత్వాని కివ్వదలచాను. ప్రభుత్వమువారు నా సూచనను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను. ఈ బంజరు భూములు కేవలము నిరుపేదలుగా వున్నవారికి వదలివేయడము సబబు అంటాను. ఒకవేళ యీ భూములకు ప్రభుత్వమువారు ఏదైనా ధర నిర్ణయించేటట్లయితే, ఆ భూములకు కొద్దిధరకట్టి, ఆ సొమ్మును వాయిదాలమీద రాబట్టుతుంటే మంచిది. ప్రభుత్వమువారు ఏదో ధరకు యిస్తామని ప్రకటన చేశారు గనుక, ఆ భూములు సాగుచేసుకున్న వారికేయిచ్చి, డబ్బుమాత్ర easy instalments లో వసూలు చేయమని కోరుతున్నాను. ఉచితంగా యివ్వటానికి ప్రభుత్వమువారికి యిష్టము లేకపోతే, కొద్ది ధర నిర్ణయించి వసూలుచేస్తే మంచిది. ఇందుకుగాను ప్రభుత్వం వెంటనే ఒక ప్రకటన చేయమని నా సలహా. అట్లుగాక, యింతవరకు యీ భూములను ఎంతో అభివృద్ధిచేసిన వారికి యివ్వకుండా, ఆక్రమణలను రద్దుచేస్తే, యికమీద వారు వాటిని వృద్ధిచేయరు. పంటలు పండించరు, ఉత్పత్తి తగ్గిపోతుంది. అందువల్ల దేశానికి అరిష్టం కలుగుతుంది. అందువల్ల ప్రభుత్వంవారు వెంటనే ఒక ప్రకటన చేయడము మంచిది, న్యాయము అని అంటున్నాను.

తరువాత, నెల్లూరుజిల్లాలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికిగాను ఒక పెద్ద కేంద్రమును ప్రభుత్వమువారు స్థాపించారు. ఈ కేంద్రము పూర్తిగా డెల్టాప్రదేశానికి మధ్యభాగములో వుండడమువల్ల, ఉత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తిలో ఏ 25 పాళ్లో, 30 పాళ్లో రైతులకు వుపయోగపడుతున్నదేగాని, మిగతా భాగమంతాగూడా యిళ్లలోనూ, ఆఫీసులలోనూ పంకాలు త్రిప్పకోటానికి, యింకను గూడూరు తాలూకాలో వున్న mines కు వుపయోగపడుతున్నవే గాని రైతులకు, వ్యవసాయానికి వుపయోగపడడములేదు. కనుక యీ విద్యుచ్ఛక్తి అంతాగూడా నిరుపయోగమవుతున్నది. ఇంత పెద్ద కేంద్రము ముఖ్యంగా రైతులకు వుపయోగపడక పోవుటము శోచనీయంగావున్నది. కాబట్టి యిప్పటికైనను యీ కేంద్రంనుంచి ఉత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తిని నెల్లూరుజిల్లాలోవున్న మెట్ట తాలూకాలకు తక్షణం సరఫరా చేసేటట్టు చూడమనిన్నీ, యిందుకు ప్రభుత్వము తక్షణ చర్యతీసుకొనవలెనని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. మరొకవిషయం చెప్పదలచాను. నెల్లూరుజిల్లాయొక్క జిల్లాబోర్డు యిప్పటికి పదిసంవత్సరాలుగా మూగపోయియున్నది. జిల్లాలో ఏరోడ్డుచూచినా బాగుగాలేదు. పదిమైళ్లు ప్రయాణముచేయాలంటె సాధారణంగా 1½ గంటలకు పైనబడుతుంది. ఈ పది సంవత్సరములనుం. ఆరోడ్లు మరమ్మతులు లేకపోవడమువల్ల అక్కడక్కడ గుంటలు, గండ్లుపడియున్నవి. ఈ మరమ్మతులకు జిల్లాబోర్డువారు ప్రభుత్వాన్ని డబ్బు అడగక పోయినప్పటికినీ, ప్రభుత్వమైనను కొంత డబ్బుయిచ్చి యీ రోడ్లను మరమ్మతు చేయించే ఏర్పాటు చేయమని కోరుతున్నాను.

ఇకపోతే, మానెల్లూరు జిల్లాలోవున్న జమీందార్ల వద్దనుంచి జమీన్‌లను ప్రభుత్వం స్వాధీనము చేసుకున్న తరువాత అక్కడ రైతులు అనేక భాధలకు, యిబ్బందులకు గురిఅవుతున్నారు. జమీందార్ల కాలములో అక్కడ గ్రామాలకుచేరువలోనున్న forests కు reservation లేనందువల్ల, కట్టె, కంప వగైరాలు తెచ్చుకుంటూ పశువులను ఉచితముగా మేపుకుంటూవుండేవారు. అటువంటిది, యీనాడు ప్రభుత్వమువారు ఆ forest ను అంతయు reserve చేయడమువల్ల. అక్కడ రైతులకు యీ సౌకర్యాలుఅన్నీ పోయినందున, యిబ్బందిపడుచున్నారు. ఒకవేళ ఆప్రాంతము reserve forest క్రింద ఏర్పరచబడేటట్టయితే, కొంత forest ను ప్రజలకొరకు unreserved గా కేటాయించి, తక్కినది reserve చేస్తే, రైతులకు ఉపయోగపడుతుందని మనవిచేస్తున్నాను.

మరొకవిషయము చెబుతున్నాను. ఇంతవరకు రైతులు ప్రభుత్వమునుంచి అప్పులు తీసుకున్నారు. ముఖ్యంగా మెట్టతాలూకాలలో పండిన పంటలధరలు యిప్పడు చాలాటుమకు తగ్గిపోయినందువల్ల, వారికి గిట్టుబాటుకాని స్థితిఏర్పడి, యీ అప్పులు తీర్చలేకపోతున్నారు. అందువల్ల యీ అప్పులు వాయిదాలమీద వసూలుచేయటానికి ప్రభుత్వము ఉత్తరవులు పంపవలసిందిగా కోరుతున్నాము. ప్రభుత్వము వెంటనే యీ అప్పల వసూలు నిలుపుదలచేస్తూ, అవసరమైతే యిప్పడు అమలులోవున్న జి. ఓ. ను గూడా మార్చుతూ, వచ్చే సంవత్సరమునుంచి easy instalments లో యీ అప్పలు తీర్చుటానికి వీలుగలుగచేస్తూ ముందు ఒక ప్రకటన తక్షణం చేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

*Sri Mahammad Tahsil:—అధ్యక్షా, శ్రీ గవర్నరుగారి ప్రసంగంపై శ్రీ రాజేశ్వరరావుగారు తీసుకువచ్చిన అభినందన తీర్మానం బలపర్చ లేకపోయినందుకు విచారిస్తున్నాను. గవర్నరు ప్రసంగంలో మారేడుమల్లినుండి చింతూరుపోయే ఏజెన్సీ రోడ్డు తెరుప ప్రయత్నాలు చేస్తున్నట్లు సూచించారు. మారేడుమల్లి చింతూరురోడ్డు వేసినంతమాత్రాన అక్కడ అడవిప్రజలకు ఏమాత్రం ఉపయోగం

వుండదు. కాబట్టి యీరోజున అక్కడనుంచి దుమ్ముగూడెంవరకు కాని కూనవరం లేదా వరరామచంద్ర పురంకలిపే రోడ్లువేయాలని నేను సూచిస్తున్నాను. తరువాత కూనవరంనుండి వెంకటాపురం వరకు ఉన్న రోడ్డుకు వాగులపై వంతెనలు నిర్మించి సంవత్సరం పొడవునా బస్‌ప్రయాణమునకు అనుకూలంగా ఉండేటట్లు ఏర్పాట్లుచేయించాలి. సంవత్సరం పొడవునా బస్‌సర్వీసులేక ప్రజలు అనేక బాధలకు గురౌచున్నారు. కూనవరంనుండి భద్రాచలం వెళ్ళాలంటే మూడురోజులు పడుతున్నది. వర్షాకాలంలో టపాల్సు సక్రమంగా రాక బాహ్య ప్రపంచంతో పూర్తిగా సంబంధం లేకుండా పోతున్నది. ఏజన్సీ ప్రాంతాలకు మిగతా ప్రాంతాలతో నిత్యసంబంధాలు వుండడం అవసరం. ఎందుకంటే ఏజెన్సీ ప్రాంతాలు చాల వెనుకబడి వున్నటువంటివని ఇక్కడున్న సభ్యులందరికి తెలిసిన విషయమే. అందుచేత దానికి చాలా ప్రాముఖ్యత యివ్వాల్సిన అవసరంవున్నది. కనీసం వెంకటాపురం—కూనవరంరోడ్డు తక్షణావసరం. ఆ ఏజెన్సీ ప్రాంతంలో ఏమిజరిగినా పైనుంచి ఏమిరావలసినా కష్టంగావుంటుంది. ఆఫీసర్లు ఎంత ఘోరంగా ప్రవర్తించినా పై అధికార్లకు తెలుపుకుంటే రావడంలేదు. కారణ మేమంటే బస్సు రూట్సు లేకపోవడమే. అందుచేత బస్సులు పోయేటందుకు వీలుగా రోడ్లను పెంచి ఏజెన్సీ ప్రాంతాలను అభివృద్ధిచేయడం అవసరం. తరువాత బస్సు చార్జీలను మైలుకి 7 పైసలనుండి 10 పైసలకు పెంచడం చాల ఘోరమైనవిషయం. దానిని వెంటనే తగ్గించే ప్రయత్నం చేయాలని మనవిచేస్తున్నాను.

The Hon. Sri. B. Gopala Reddi:—తగ్గిస్తే బస్సులు నడవవు.

Sri Mahammad Tahsil:—నడవకపోవడం రోడ్డు సరిగా లేకపోవడంవల్ల. ఇందులో వచ్చిననష్టాన్ని ప్రభుత్వం భరించవలసి వుంటుంది. అయితే ఆ రోడ్లు సరిగా లేకపోవడం ప్రభుత్వంయొక్క తప్పుగాని, ప్రజలతప్పుకాదు. 1954 వ సంవత్సరం వరకు 0—0—7 పైసలకు నడిపితే లాభాలేవచ్చాయి గాని నష్టంరాలేదు. ఈ సంవత్సరమే పెంచారు. ప్రభుత్వోద్యోగులు ఆప్రాంతాల్లో అనేకమైనటువంటి దారుణాలు చేసి ప్రజలను పీక్కుతినడం జరుగుతున్నది. ఫారెస్టు డిపార్టుమెంటువారు అక్కడ ప్రజలచేత నిర్బంధంగా వ్యవసాయ తరుణంలో వెట్టిచాకిరిచేయించి వ్యవసాయం చేసుకోనివ్వడంలేదు. వెట్టిచాకిరిచేయ నిరాకరించిన వారిపై అక్రమ కేసులుపెట్టి జరిమానా వేయడం జరుగుతున్నది. ఆ ఒత్తిడిని వెంటనే నిల్పించాలని ప్రభుత్వానికి నేను మనవిచేస్తున్నాను. ఏజెన్సీ ప్రాంతాల అభివృద్ధిని గురించి మలయప్పన్‌గారుకొన్ని సూచనలు చేశారు. ప్రభుత్వంవారు ఋామలయప్పన్ కమిటీసూచనలను ఆమోదించి ఆప్రాంతాలను అభివృద్ధిచేయాలని మనవి చేస్తున్నాను. ప్రభుత్వంవారు కట్టించిన Housing కాల్సనీ ప్రజలుకోరిన ప్రదేశాలలో కట్టకపోవుటచేత ప్రజలు కాలనీలలో వుండుటలేదు. వుదాహరణకు, నూగూలు తాలూకాలో మారఫీదు దగ్గరవున్న విజయపురం కాలనీలో సుమారు 70 యిండ్లువున్నవి. అందులో ఎవరూలేక చెట్లు మొలిచాయి. కారణ మేమంటే, వ్యవసాయం చేసుకొనుటకు భూములు లేకపోవుటవల్ల, ప్రక్కనే వున్నటువంటి రిజర్వు ఫారెస్టును ప్రత్యేకించినప్పటికి ఫారెస్టు డిపార్టుమెంటువారు చెట్లు నరకకొనుటకు అనుమతి నిరాకరించినందువల్ల జీవనోపాధిలేక వదలి వెళ్ళిపోవలసి వచ్చినది. ఇప్పటికే వ్యవసాయ తరుణం దాటిపోతున్నది గాన, బుల్‌డోజర్లు, ట్రాక్టర్లు వుపయోగించి భూమిని సేద్యంలోకి తెచ్చి జీవనోపాధి కలిగించాలని కోరుతున్నాను. ఏజెన్సీ ప్రాంతాల్లో మలేరియా విపరీతంగా వున్నది. మందులు ఏమాత్రం లభ్యం కావడంలేదు. తాలూకా ఆసుపత్రికిపోయి తీసుకోవలెనంటే 10,15 మైళ్లదూరం పోవాల్సివుండి కష్టంగావున్నది. అందుచేత ఏజెన్సీవాళ్లకు ప్రత్యేకంగా టూరింగు డాక్టర్సు ద్వారా మందులు యిప్పించే ఏర్పాట్లు చేయాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

26th April, 1955]

**Sri C. Subbarayudu:**— అధ్యక్షా, పార్లమెంటులో ఒక ఆచారమువున్నట్లు వింటున్నాము. ఆంధ్రరాష్ట్రములో ఎన్నికలు జరిగిన తర్వాత పార్లమెంటులో అనుసరిస్తున్న ఆచారము ఇక్కడ అవలంబించినట్లయితే శాసనసభ్యులకు, వారు ప్రాతినిధ్యమువహించిన ప్రజలకుకూడ పెద్ద ఉపకారము జరుగుటకు అవకాశాలువుంటాయి. శాసనసభ్యులు ఇక్కడచెప్పే సమస్యలను గురించి మంత్రులు వాటిపై ఏ చర్యతీసికోదలచారో శాసనసభ్యులకు తెలిపినట్లయితే శాసనసభ్యులకు ప్రభుత్వానికి ఎప్పటికప్పుడు విషయాలు తెలిసికొనడానికి, ఆ విషయాలు ప్రజలకు తెలియపర్చడానికి అవకాశము వుంటుందని అటువంటి విధానమును అనుసరిస్తే బాగుంటుందని మీద్వారా వారిని ప్రార్థిస్తున్నాను.

ఇక గవర్నర్‌గారి ప్రసంగమునుగురించి ఎక్కువగా మాట్లాడనవసరములేదు. కొద్దిరోజులలో ఆంధ్రరాష్ట్రము బాగుపడాలంటే ప్రభుత్వము రైతులను కరవుబాధలనుండి తప్పించేటట్లు చూడవలెను. రైతాంగముయొక్క కొనుగోలు శక్తి పెంచడానికి వీలువుంది. ఈ విద్యుచ్ఛక్తి ఎంత త్వరగా అభివృద్ధిచేస్తే అంతత్వరగా రైతులు అభివృద్ధిపడడానికి వీలువుంటుంది. నందికొండ ప్రాజెక్టు ప్రారంభించబడుతుందని విన్నప్పుడు చాలసంతోషించినాము. కాని తుంగభద్ర ఎగువ కాలువను గురించి పరిశీలనలు పూర్తికాలేదు. తుంగభద్ర నీరు పారుదలకు ఉపయోగపడడానికి సమగ్రమైన పథకము ఏర్పాటుచేయవలసిన అవసరముంది. తుంగభద్ర నీటిని మూడు స్థలాలలో నిలువచేస్తున్నారు. అవి (1) మల్లాపురం రిజర్వాయర్ (2) రాజులబండ (3) సుంకేశల ఆనకట్ట. ఎగువ కాల్వక్రింద అనంతపురములో 4 లక్షల ఎకరాలు సాగుకుచేర్చే అవకాశమువున్నప్పటికినీ ఉన్నప్రాంతాలకే యీ నీటిని వాడడము జరుగుతోంది. ఇప్పుడు డామ్‌లోఉన్న నీటిపరిమాణాన్ని పెంచడానికి అవకాశముంది. ఈ ఎక్కువనీటిని తీసికొని పెన్నార్‌పై రిజర్వాయర్‌కట్టి అక్కడినుంచి ధర్మవరం తాడిపత్రి అనంతపురం తాలూకాలకు నీరుపారడానికి అవకాశము కలిగించవచ్చు. క్రొత్త అలైన్‌మెంటు పరిశీలనకాకుండ అక్కడ ఆయకట్టు propose చేయవద్దని Engineers చెప్పుతున్నారు. ఈ ప్రాంతములో సంపూర్ణముగా ఎగువకాల్వనీరు ఉపయోగించుకుంటేనే తప్ప కరవునుంచి తప్పించుకోవడానికి అవకాశములేదు. కర్నూలు–కడప కాల్వకు 4 కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టడము దండుగఅని చెప్పుతున్నాను. సిద్ధేశ్వరము ప్రాజెక్టువస్తే యీ కాల్వక్రింద సాగయ్యేభూమి 95 పాళ్లకు ఉపయోగపడుతుంది. కృష్ణనీరు లభ్యమయ్యే ప్రాంతాలకు తుంగభద్రనీరు ఆపుచేసినపుడే దాని ప్రయోజనము పూర్తిగా లభిస్తుంది. Upper Pennar reservoir లో నీరుమిగిలితే బుక్కపట్నం చెరువుకు ఉపయోగపడు తుంది. తుంగభద్ర ఎగువకాల్వను వెంటనే తీసికొని పని ప్రారంభించడానికి పూనుకోవలెనని మనవిచేస్తున్నాను.

ఇక స్థానికపరిపాలనా మంత్రిగారికి కొన్ని విషయాలు మనవిచేస్తున్నాను. మునిసిపాలిటీలు రైతుల బండ్లు వచ్చినపుడు గేటుపన్ను వసూలుచేయడము జరుగుతున్నది. తిమ్మారెడ్డిగారు మంత్రిగా వున్నప్పుడు వారికి ఈ విషయమై దరఖాస్తులు పెట్టుకొన్నారు. ఈ పన్ను రద్దుచేసే సంగతి తొందరగా పూనుకోవాలని మనవిచేస్తూ యింతటితో నేను సెలవు తీసుకుంటున్నాను.

**Sri D. Gopala Rao:**—Mr. Speaker, Sir, while supporting the amendments moved by Sri R. B. Ramakrishna Raju (amend-

(Sri S. D. Gopal Rao) [26th April, 1955

ments 18 to 28) I propose to speak in particular about amendments 21 and 22. But before doing so, at the outset I would request the Members of this House to forgive me in suggesting that we should now forget all the results about the elections and take them in a sportive way. It is only then that we may be able to work as a team and do something good to our constituencies. If we have the rancour and seek to criticise one party or the other, I am afraid there would not be any time to work in unison for the common welfare of the people.

Then, Sir, I wish to say about the Eleru project. I learn investigations have been going on, and I would request that these investigations should be expedited and something practical done for the upland taluks, whose irrigation scheme is very erratic, in the sense that in some villages twenty to thirty rupees have been spent to irrigate one acre of land, and the hardship of the ryots may well be imagined. The Eleru river is a very erratic one, for however much one may improve it, it gets silted up, and for the clearance of the silt a ryot has got to spend a large sum of money. I am not exaggerating when I say that a ryot spends Rs. 30 to irrigate one acre of land.

In some villages in Rajamundry taluk and Peddapuram taluk there is no drinking water supply, and due to the lack thereof this cattle and men are suffering much. I request the Hon. Minister for Planning to include as many villages as possible in the National Extension Scheme and thus solve this drinking water supply.

Sri D. Ramabrahmam:—అధ్యక్షా, నేడు మనఎదుటచర్చజరుగుతున్న రాజేశ్వరరావు గారి అభినందన తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను. 122 కోట్ల రూపాయిలు ఖర్చుఅయ్యే నందికొండ ప్రాజెక్టు నిర్మాణానికి ఏర్పాట్లు చేసినందుకు, 10 కోట్ల రూపాయిలు major, minor, medium irrigation పనుల క్రింద కేటాయించినందుకు, గౌతమి నదికి ఆలమూరువద్ద, పెన్నారునదికి చెన్నూరు వద్ద, తుంగభద్రకు కర్నూలువద్ద వంతెనల నిర్మాణాలకై సూచించినందులకు, విజయవాడలో ఎరువులఫాక్టరీ, ఇంకా ఇతరచోట్ల textile, sugar and cement mills ఏర్పాటుకై Central Government వారిని కోరినందులకు, small scale industries విషయమై 21 స్కీములు పరిశీలించి నందుకు గవర్నరుగారిని, ప్రస్తుత మంత్రివర్గాన్ని అభినందిస్తున్నాను. Small scale industries, గురించి investigate చేసే సందర్భంలో, ప్రస్తుతం Andhra Chamber of Commerce వారి delegation జపానులో పర్యటన చేస్తోంది; కాబట్టి కొందరు technicians ను అక్కడకు పంపి small scale industries పనిచేసే విధానాన్ని గమనించి మనం ఇక్కడ వాటిని ఏర్పాటు చేసుకోడానికి ఏర్పాట్లు చేయించాలని కోరుచున్నాను. ఇంక local development స్కీములలో రోడ్ల నిర్మాణానికై కొన్ని లక్షలు ఖర్చుచేయవలసిన బాధ్యత ప్రభుత్వంపై వున్నది. ఎన్నికల సమయంలో

ప్రచారానికి వెళ్లినపుడు గ్రామాలకు పోయేరోడ్లు ఎంత అధ్వాన్నంగా వున్నవో అందరికి తెలుసును. అన్ని పక్షాలవారు ఇబ్బందులుపడివుంటారు. అందుచేత ఈ రోడ్ల మరమ్మతులు తక్షణం చేయించాలి. రాయలసీమలో కరువురోడ్లు అనేపేరుతో జిల్లాబోర్డువారి ఆధ్వర్యంక్రింద కొన్నిరోడ్లు నిర్మించబడ్డాయి. కాని ఇప్పుడు జిల్లాబోర్డుల ఆర్థికస్తోమతు బాగాలేనందున వాటికి ఏమీ మరమ్మతులు జరగడంలేదు. ఈ రోడ్లమీద మట్టివేయడానికైనా ప్రయత్నాలు జరగడంలేదు. ఈ పనుల నిమిత్తమై జిల్లాబోర్డులకు కొంత grant ఇవ్వాలని కోరుతున్నాను. చిత్తూరు జిల్లాలో రైతులకు విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తున్నారు. ఈ విద్యుచ్ఛక్తిరేట్లు 11 దమ్మిడీలనుంచి 1¼ అణావరకు పెంచారు. అందువల్లచిన్నచిన్నపరిశ్రమలు నడుపుకునేవారుకూడా రు. 50 లు కట్టుకోవలసి వస్తోంది. ప్రతిపక్షంలో కూర్చున్న రంగనాథ ముదలియారుగారు, ఇదివరలో మద్రాసులో మంత్రులుగావున్న గురుపాదంగారు ఎన్నికల సమయంలోవచ్చి ఆంధ్ర.అరవ ప్రచారంచేస్తూ అరవరాష్ట్రంలో వుంటే విద్యుచ్ఛక్తి తక్కువధరలకు వస్తుందని, ఆంధ్ర రాష్ట్రంలో రాదని చెప్పారు. సరిహద్దుల్లో ఆంధ్రులకు ఈ నాడు అన్యాయం జరుగుతోంది. ఆంధ్రులకు అన్యాయం జరుగకుండా వెంటనే చర్య తీసుకోవాలని కోరుతున్నాను. ఆనాడు P.W.D. మంత్రిగావున్న రంగారెడ్డిగారు 0—0—1 పెంచుతాము అని చెప్పారు; ఇప్పుడు రెండురెట్లు పెంచారు. దీనిని గమనించి, రేట్లు విషయమై పునఃపరిశీలన చేయించి రేట్లు తగ్గించేవిషయం చూస్తారని ఆశిస్తూ రాజేశ్వరరావుగారి తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను.

*Sri P. Gopalu Reddi:—అధ్యక్ష మహాశయా, తోటి సభ్యులతో గవర్నరుగారి ప్రసంగానికి అభినందనాలు అర్పించడంలో కలుస్తానని తెలియచేస్తున్నాను. బడ్జెటు తయారుచేసే సందర్భంలో గమనిస్తారనే వుద్దేశంతో కొన్నిసూచనలు మాత్రం చేస్తాను. ముఖ్యంగా చిన్నచిన్న రైతులకు శిస్తుబాధ లేకుండా చేయాలనే అభిప్రాయంతో గత మంత్రివర్గంవారు రు. 10 లు అంతకులోపుగా వుండే భూమిశిస్తు రద్దుచేయాలని నిర్ణయించారు. ఆ నిర్ణయంచేసినపుడు అంతా సమగ్రంగా ఆలోచించివుంటారని మనం భావించవలసి వుంటుంది. నందికొండ ప్రాజెక్టు నిర్మించుకోవలసిన సందర్భంలో, కేంద్రప్రభుత్వంవారు ఇచ్చిన షరతులను అనుసరించి ప్రస్తుతానికి ఈ శిస్తు మినహాయింపు అమలుచేయలేము అని గవర్నరుగారి ప్రసంగంలో ఉన్నది.

అయితే మన ప్రతిపక్షములో ఉన్నటువంటి గౌరవసభ్యులు శ్రీ R. B. రామకృష్ణరాజుగారు చెప్పినట్లు ఎప్పటికైనా కూడ ఈ land revenue అనే సిద్ధాంతాన్ని రూపుమాపవలసిన పరిస్థితులు వచ్చినప్పుడే, రైతులందరు బాగుపడుతారు అనేవిషయము అందరు ఒప్పుకోవలసి యుంటుంది. అన్ని రకముల పన్నులను రైతులమీద వేస్తూవున్నారు. కాబట్టి, మంత్రులు దీనినిగురించి పునరాలోచించి, ఏదివిధముగాఅయితే—ఈ పదిరూపాయల శిస్తు మినహాయింపు చేసిగాని, మరోవిధంగాగాని, రైతులకు సహాయంచేయడానికి వీలగునో ఆవిధంగా, ఒకవిధమైన సూత్రాన్ని ఆలోచించి రాబోయే బడ్జెటులో దాన్ని విశదీకరిస్తారని నమ్ముచున్నాను.

తరువాత మా మిత్రులు చిత్తూరుజిల్లానుంచి వచ్చిన అరవసోదరుడు మాట్లాడుతూ, చిత్తూరుజిల్లాలో మాదుర్దశలో అరవలు వున్నారనిన్నీ, వారికి కనీససౌకర్యములు కలుగజేయుట లేదనిన్నీ విశేషంగా చెప్పారు. ఈ సందర్భంలో దాన్నిగురించి కొంత చెప్పకతప్పదు. అరవలు తెలుగువారు ఏకీభావంతో ఉండేటటువంటి పరిస్థితులలో, ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత కొంతమంది స్వార్థపరులు బయటనుంచి వచ్చి అక్కడవుండే అమాయకులైన ప్రజలను చేసి

(Sri P. Gopalu Reddi) [26th April, 1955

పించి లేనిపోని భాషాద్వేషాలు కల్పించి మొన్న జరిగిన ఎన్నికలలో అనేక దుష్ప్రచారాలు చేయడం జరిగిందని అందరు పత్రికలలో చదివేఉంటారు. అంతేకాని, అరవలకు ఎటువంటి అన్యాయము, తెలుగువారివల్లగాని ఆంధ్రప్రభుత్వంవల్లగాని కలుగలేదు అనేవిషయాన్ని దృఢముగా నేను మీకు తెలియజేయవలసి యున్నది. ఈ సందర్భమున ఇంకా ఒకవిషయము చెప్పవలసియున్నది. ఒకానొక కాలములో మద్రాసు ఉమ్మడి రాష్ట్రములో అవనాశలింగం చెట్టిగారు విద్యాశాఖా మంత్రిగా ఉండినప్పుడు చిత్తూరు జిల్లాలోని 92 స్కూళ్లలో తెలుగులేకుండా చేశారు. ఈవిధంగా శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణగారు వేసిన ప్రశ్నకు జవాబుఇచ్చిన విషయము రాజ్యసభలో మన రంగనాథ ముదలియారుగారికి తెలియదేమో. అటువంటి సమయమున ఆనాడుకూడ దానినిగురించి తెలుగువారు ఆందోళన చెందలేదు. ఈనాడు అరవలకు అన్నివిధాలా అంటే స్థానికసంస్థలలో అయితే నేమి ఇతర సంస్థలలోనైతే నేమి, అన్నిచోట్ల వారికి కావలసిన సౌకర్యాలు, వారిభాషకు ఆదరణ కలిగింప మన ప్రభుత్వము పూనుకొన్నది. ఈనాడు, కర్నూలులోను, విజయవాడలోను, విశాఖపట్టణం వరకుకూడ అరవలకు కావలసిన ఆదరణ ఉంటువున్న కాలములో మేము మైనారిటీలమని, మాకు రక్షణకావాలని వారు చెప్పడం అతిశయోక్తిగా ఉన్నదని చెప్పవలసియున్నది.

Sri T. V. Raghavulu:—అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగమునకు, వారికి అభివందనము అర్పించుచున్నాను అయితే గవర్నరుగారి ప్రసంగములోని అనేక ముఖ్య అంశాలమీద ఇదివరకే దీర్ఘమైనటువంటి చర్చజరిగింది. కనుక పునరుక్తిదోషమునకు పాల్పడి సభవారి అమూల్యమైనటువంటి కాలమును దుర్వినియోగపరచుటకు ప్రయత్నంచేయక కొన్ని సూచనలుమాత్రము ప్రభుత్వంవారు దృష్టిలో పెట్టుకోవలసిందిగా మనవి చేయదలచాను.

నూతన ఆంధ్రరాష్ట్రముయొక్క భావి భాగ్యోదయ రేఖను తీర్చి దిద్దడానికి నాంది ప్రాయమైనటువంటి తొలిచర్య ఏదైతేఉన్నదో దానికి కావలసిన ప్రణాళికలు, ప్రజాహిత కార్యకలాపాలకు కావలసిన ఆదరణ ఈ ప్రసంగంలో కన్పడడం ముదావహము, శుభసూచకము. ప్రజలకు కావలసినవి వ్యవసాయక రంగములో నైతేనేమి, తదితర రంగములలో నైతేనేమి, ప్రభుత్వమువారు వారికి ఉన్నటువంటి ఆదాయపరిమితులకు లోబడి చేయదగినదంతా చేశారు. సాహసోపేతమైనటువంటి విధానాన్ని తలపెట్టారని నేను మనవిచేస్తున్నాను. అందుచేత, గవర్నరుగారికి ఈ సభవారు తమ అభివందనములను, అమోదాన్ని తెలియపరచడంలో ఆశ్చర్యంలేదు. అయితే, మనము తలపెట్టినటువంటి నూతనవ్యవస్థ నూతన socialistic pattern of society కి నాంది వేయంగా కావలసినటువంటి చర్యలు మాత్రము కొన్ని తీసుకోకతప్పదు అని మనవిచేస్తున్నాము. వ్యవసాయ కూలీలకు కనీసవేతనాలు నిర్ణయించే సందర్భములో దీనిని కనీసవేతనాల చట్టంలో చేర్చవలసిందిగా కార్మిక సలహా సంఘసభ్యుడుగా ఢిల్లీలో కృషిచేసే అదృష్టము నాకు కలిగింది. ఇప్పుడు ప్రభుత్వంవారు కనీస వేతనాలు నిర్ణయించడానికి తొలిచర్యగా 14 గ్రామాలలో దీనిని తనిఖీలు జరుపుతున్నట్లు వివరించారు. ఇది చాలా ముదావహము. అయితే ఈ చర్యతీసుకోవడంతో, ఎంత త్వరగా అమలుచేస్తే అంత మంచిది. ఉన్నవారి గాదెలమీదపడి పేదవాడి ప్రాణాలుపోకుండా చూడాలి. వ్యవసాయకూలీలు ఎక్కువ ఋణభారముతో కృంగిపోతున్నారు. వారిని ఋణభారమునుండి విముక్తులుగా చేయడానికి తగిన శాసనము ఇక్కడ తలపెట్టడం చాలా అవసరమని అనుకొంటూను,

లేకపోతే, ఈ ఋణభారముతో క్రుంగిపోతున్న ఈబీద వ్యవసాయకూలీలు ఏవిధముగా తమ జీవితపాత్రను నిర్వహించగలరు' అని సంశయిస్తున్నాను.

తరువాత హరిజనులకు నివాసస్థలములకుగాను 2½ లక్షలు 1955–56 సంవత్సరానికి కేటాయించారు. అవిధంగా పది లక్షల రూపాయలు సమకూర్చగలిగినట్లయితే, వారికి నివాసస్థలాలు కలుగచేసేందుకు వీలుగాఉంటుంది. అయితే ఈ విషయములో కొంత జాప్యము జరుగుచున్నది. అంతేగాక, ఇళ్ళు కట్టించడానికయ్యే ఖర్చులో నూటికి 50 రూపాయిలు అప్పుక్రింద మిగతా 50 రూపాయిలు వుచితంగానుయిచ్చి బీదలకు ఇళ్ళుకట్టించే భారము ప్రభుత్వముమీద ఉన్నది. దానికి నాంది ప్రాయముగా, మచ్చుకైనా ఇటువంటి ఉద్యమానికి పూనుకోవలసిందిగా ప్రభుత్వంవారికి సవినయంగా మనవిచేస్తున్నాను.

ఇప్పుడు ఆర్థిక మాంద్యము ప్రబలింది. ఆహారదినుసులలోనైతేనేమి, వ్యాపార దినుసులలో నైతేనేమి, ధరలు పడిపోవడం ప్రారంభమైంది. రైతులకు ఒకవిధమైన అలజడి కలుగుతున్నటువంటి విషయం తమరు చూస్తూనేఉన్నారు. ఈ సందర్భంలో ధరలు పడిపోకుండా, వీటిని స్థిరీకరించేటటువంటి ఒక ఉపాయమును కనిపెట్టవలసిందిగా అనేకమంది చెప్పారు. Price stabilising machinery అనేది అమెరికాలో ఉన్నట్లు చెపుతున్నారు. అయితే అది తేలికపనికాదు. అది చాలా complicated విషయము. అందుచేత గవర్నమెంటువారికి ఉన్న వ్యవధినిబట్టి ఈ విషయాన్నికూడా కొంత ఆదరణతో చూచి రైతులను సకాలంలో ఆదరించడానికి ప్రయత్నంచేయాలి.

మాజీ గీతపనివారిని గురించి తప్పక చెప్పవలసియున్నది. నా నియోజక వర్గంలో వోట్లు గురించి తిరిగినప్పుడు వారి బాధలు చూచాను. వారి నిత్యజీవితంలో అనుభవించేటటువంటి బాధలు చూడలేము. వారు అటు చావనూలేరు, ఇటు బ్రతుకనూలేరు. వారిది జీవన్మరణ సమస్యగా తయారైంది. Literal struggle for existence ఎక్కడ ఉన్నదిఅంటె ఈ మాజీ గీతపనివారిలో మాత్రమే ఉన్నదని చెప్పవచ్చు. వంశానుగతంగా వచ్చిన జీవనోపాధిని గోల్పోయి, కేవలం దొంగసారాయి అమ్ముకోవడం తప్ప వారికి బ్రతుకుతెరువుగాని, honest living గాని లేకుండా పోయింది. వీరి employment గురించి ప్రభుత్వంవారు సంఖ్యావివరాలు సేకరిస్తున్నట్లు మనవి చేశారు. అయితే, ఇది చురుకుగా చేయాలని మనవిచేస్తున్నాను. వారికి తగినటువంటి employment కూడా ఇవ్వడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేయాలి.

ఇక హరిజనుల విషయంలో, వారు చర్మాలతో వస్తువులు తయారుచేసుకొనుట వృత్తిగా కలిగి ఉన్నారు. అందుకు వారికి కావలసినటువంటి సహాయం సహకార సంఘములద్వారా కల్పించి వారి వృత్తికి దోహదం ఇవ్వడానికి ప్రభుత్వంవారు ప్రయత్నం చేసినట్లయితే, హరిజనోద్ధరణకు తగినంత కృషిచేసిన వారవుతారని మనవి చేస్తున్నాను.

నేను lawyer గా ఒకవిషయము చెప్పదలచాను. Court Fees Act విషయములో కూడా తమరు సంస్కరించవలసిన రోజులు వచ్చినవి. వ్యాజ్యాలకు పోయే ప్రజలు స్టాంపుడ్యూటీ కట్టుకోలేకుండా ఉన్నా కోర్టులకు పోలేక చాలా బాధపడుచున్నారు. దీన్నికూడా మీరు గమనించాలని మనవి చేస్తున్నాను.

కొవ్వూరు తాలూకాలో స్వల్పవ్యయముతో అనగా 25 లక్షల రూపాయలతో తయారవ్వేటటు వంటి సుమారు 15,20 వేల ఎకరాల భూమి సాగు క్రిందికి [illegible]

(Sri T. V. Raghavulu) [26th April, 1955

పంపింగు స్కీము అనేది ఒకటి మా ఆలోచనలోవుంది. అది ప్రభుత్వమువారికి ఇదివరకే మనవి చేశాను. దానివిషయంలోగూడా తగిన కృషిచేస్తే కొద్ది వ్యయముతో స్వల్పకాలములో ఎక్కువ ప్రయోజన కరమయిన నీటివసరు కల్పించవచ్చు కాబట్టి అదిగూడా మీరు తలపెట్టిన స్కీముల క్రిందకువస్తుంది. గనుక దాని విషయంగూడా శ్రద్దవహించ వలసిందిగా మనవి చేస్తున్నాను.

Sri Raja Sagi Suryanarayana Raju:—అధ్యక్షా, గవర్నరుగారి ఉపన్యాసంమీద తెచ్చిన అభివందన తీర్మానమును బలపరుస్తున్నాను. కాని దీని విషయములో నా స్వంతసలహాలు, నా స్వానుభవమును గురించి తమద్వారా మంత్రివర్గానికి తెలియజేయ దలచుకున్నాను. గవర్నరుగారి ఉపన్యాసముద్వారా వారు మనకు ఎన్నో మంచిసంగతులు తెలియజేసినందుకు వారిని అభినందించేముందు, మీరు నాకు మాట్లాడటానికి అవకాశమిచ్చినందుకు మిమ్ములను నేను ముందుగా అభినందిస్తున్నాను.

Public works విషయములో ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద ఒకకోటి ఇరవై లక్షల రూపాయల విలువగల ప్రాజెక్టులు కొన్ని కట్టడానికి మన ప్రభుత్వంవారు కేంద్ర ప్రభుత్వంవారికి recommend చేసియున్నారు. అయినను యీ ప్రాజెక్టులకు investigation పూర్తికానందువల్ల మా జిల్లాకు సంబంధించి పదిలక్షల రూపాయలు విలువజేసే ఒక ప్రాజెక్టుమాత్రం శాంక్షను చేశారు. సర్కారు సోదరులైతేనేమి, రాయలసీమ సోదరులైతేనేమి, మాకు నందికొండ వచ్చింది, యిదివరకే మాకు ఎనిమిది ప్రాజెక్టులు వచ్చినవి, మాకు కృష్ణా రెగ్యులేటరు బ్రిడ్జి ప్రారంభించారు, మా గోదావరి జిల్లాలో పంటలకు నీరు సమృద్ధిగావుంది అని చెప్పి సంతృప్తిపడుతున్నారు. అయితే మా విశాఖపట్నం జిల్లావారు యింకను సంతృప్తిపడలేదని యిందాక కొంతమంది సభ్యులు మాట్లాడారు. వారు చెప్పిన విషయములన్నియు చూస్తే, నాకు కొంత విచారము కలుగుచున్నది. మా విశాఖపట్నం జిల్లాను గురించి నేను కొన్ని సంగతులు మీకు తెలియజేయ దలచుకున్నాను. మా విశాఖపట్నం జిల్లా neglect చేయబడిన విధముగా, మన రాష్ట్రములో మరే జిల్లాగూడా neglect చేయబడలేదు. దానికి కారణములు ఒకటొకటిగా మనవి చేస్తున్నాను.

గత ఎన్నికలలో మా జిల్లానుంచి కాంగ్రెసు అభ్యర్థిగా ఒక్కరూగూడా ఎన్నిక కాబడకపోయినను, యీసారి అయిన ఎన్నికలలో ఏడుగురు కాంగ్రెసు అభ్యర్థులు ఎన్నికకాబడ్డారు. మేమంతా కాంగ్రెసులో చేరినందువల్లనే ఎన్నిక కాబడ్డాము. అందువల్ల యిక్కమీదట అయినను మా జిల్లాను neglect చేయరని ఆశిస్తున్నాను. ఈ మధ్య సంజీవరెడ్డిగారు మా జిల్లాకువచ్చి, అక్కడవున్న వల్లగొండ మువ్వాక ప్రాజెక్టు, రేకబానువ కాలువగట్టు ప్రాజెక్టు, యీ రెండున్నూ చూచి, ఈ రెండింటి కిన్నీ detailed investigation చేయుమని ఆర్డరువేశారు. తరువాత అది మా దురదృష్టమే కాబోలు, ఒక్క వల్లగొండ మువ్వాక ప్రాజెక్టుకు మాత్రమే detailed investigation కు ఆర్డరు అయిందని పత్రికలలో పడింది. ఇంతలో నవంబరు ఆరవ తేదిన గవర్నమెంటు పడిపోయింది తరువాత ఎలెక్షనులు వచ్చినవి. ఎలెక్షను ప్రచారములో యీ రాజుగారే, యీ ప్రాజెక్టులు రాకుండా నాశనము చేశారని నా మీద ప్రచారముచేశారు. నిజంగా, యీ ప్రాజెక్టుల విషయంలో నేను ఎంత కష్టపడి వారిచేత యీ ఆర్డరు వేయించుకున్నానో, ఆర్డరువేసిన సంజీవి రెడ్డిగార్కి తెలుసు, నాకు తెలుసు, భగవంతునికి తెలుసు. నామీద ఏవిధమయిన అభిమానంతో వారు ఆ ఆర్డరు వేశారో మీకు తెలుసు. తరువాత గవర్నరుగారి పరిపాలన వచ్చింది. వారి పరిపాలన వుండగా ఈ ప్రాజెక్టుల detailed investigation విషయమ్ము ఏమయిందో నాకు తెలియదు. అది మధ్యలోనే ఆగిపోయి

వుండవచ్చు. అందుచేత ప్రభుత్వమువారు మరల ప్రత్యేకశ్రద్ధ తీసుకొని ఈ ప్రాజెక్టులతో సహా మా తాలూకాలోవున్న తాండవనదీ ప్రాజెక్టుకుగూడా detailed investigation పూర్తిచేయిస్తారని ఆశిస్తూ మరల ఈ విషయాన్ని సంజీవ రెడ్డిగారికి జ్ఞాపకము చేస్తున్నాను. ఇదికాకుండా మాజిల్లలో కల్యాణపురం ప్రాజెక్టుఅని మరొకటి వున్నది. దానికికూడా వీటితోపాటు detailed investigation అవసరమున్నది కాబట్టి అదిగూడా పూర్తి చేయించమని మనవి చేస్తున్నాను. సంజీవ రెడ్డిగారు మా జిల్లాకు వచ్చినప్పుడు వీటన్నిటికి ఆర్డరు వేస్తానని చెప్పారు. కాని అది ఏమయిందో నాకు తెలియదు. దాన్నిగురించి పరిశీలించమని సంజీవ రెడ్డిగారిని కోరుతున్నాను.

తరువాత రోడ్లనుగురించి, bridges నుగురించి మా జిల్లాకు సంబంధించినవి యింకా చాలా సంగతులున్నవి. అధ్యక్షులవారు సభ్యులందరికి చాలా కొద్ది time యిస్తున్నారు కాబట్టి భయపడుతూనే సంగతులు మనవిచేస్తున్నాను. అందుకు నన్ను క్షమించాలి. మా జిల్లాలో రోడ్లు అధ్వాన్నస్థితిలో వున్నవి. ఈతడవ కొత్తగా ఎన్నికఅయిన గొట్టుముక్కల జగన్నాధరాజుగారు యిప్పుడిక్కడ సభలో కూర్చునివున్నారు. వారు వెనుక Justice Party లో వున్నప్పుడు మా జిల్లాబోర్డు ప్రెసిడెంటుగా వున్నారు. ఆ సమయంలో మాజిల్లాలో కొన్ని bridges కట్టించడానికి డబ్బు sanction చేయించి రోడ్లువేయించటానికి అవకాశమిచ్చారు. తరువాత మా దురదృష్టవశాత్తు ఆ బ్రిడ్జీలు కొన్ని గాలివానలవల్ల floods వల్ల పడిపోయినవి. తరువాత 1952వ సం॥ నుంచి యింతవరకు ఎన్నోసార్లు ఈ బ్రిడ్జీల విషయం ప్రభుత్వ దృష్టికి తెచ్చినప్పటికినీ, నేనుగూడా స్వయంగా ఈ శాసనసభలో చెప్పినప్పటికినీ వాటి మరమ్మత్తుల విషయం మరచిపోయినారో ఏమోగానీ మంత్రిగార్కి మా జిల్లాయందు దయగలుగలేదు. మా జిల్లాలో పరిస్థితులు యిట్లావుండగా సభ్యులందరు ఎంతసేపు చూచినా మా గుంటూరుజిల్లా, మా గోదావరిజిల్లా, మా కృష్ణాజిల్లా, మా రాయలసీమ అని చెప్పుకుంటూ పనులు చేయించుకుంటూన్నారు గాని మా విశాఖపట్నం జిల్లామీద ప్రభుత్వానికి ఏమాత్రము అభిమానమున్నట్లు కన్పడదు.

కొత్తవలసలో ఒక sugar ఫ్యాక్టరీ ఉన్నది. ఈ factory కి పొయ్యే రోడ్డు వేసేటందుకు ఒకలక్షపదకొండువేల రూపాయలు సెస్సుల క్రింద ప్రభుత్వమువారు ప్రజలవద్దనుండి వసూలుచేశారు. ఈ డబ్బు ప్రజలు కట్టినప్పటికిని ఈ రోడ్డు improve చేయబడలేదు. 1952వ సం॥ నుంచి యిప్పటిదాకా అనేక విధాలుగా ప్రభుత్వంవారిని ఈ విషయంలో press చేయటంవలన ఈ సంవత్సరం అక్కడ నాల్గుమైళ్ళ తారురోడ్డుమాత్రం sanction చేశారు. ఆరోడ్డు మొత్తం పొడుగు 24 మైళ్ళువున్నది. అదిపూర్తిగా District Board roadగానేవుంది. ఇది కొత్తవలస నుంచి దార్లపూడివరకు పోతుంది. వానాకాలములో ఆరోడ్డుమీద బండ్లు దిగబడిపోతున్నవి. కార్లు చూద్దామా అంటే అసలు అవి నడవనే నడవవు. అలాంటి సందర్భములో ఈ sugar factory కి వెళ్ళడానికి చుట్టుప్రక్కలవున్న గ్రామాల రైతులు ఎంత బాధపడుతూవుంటారో ప్రభుత్వంవారే గ్రహించుతారనుకుంటాను. District Board కు funds లేవు గనుక ఈ రోడ్డునుమాత్రం highways శాఖ వారి చేతనైనా మరమ్మతు చేయించగలందులకు ప్రభుత్వంవారిని ప్రార్థిస్తున్నాను. ఇతర జిల్లాబోర్డులు అంటే, చిత్తూరు, రాయలసీమలోవున్న జిల్లాబోర్డులకు అప్పులు యిచ్చారు. ఇక మా జిల్లాబోర్డుచూస్తే తీసుకున్న అప్పే తీర్చుకోలేని స్థితిలోవుంది. కనుక ఈ కొత్తవలస దార్లపూడి రోడ్డునైనా Highways Department చేత రిపేరులు చేయించవలసిందిగా

(Sri Raja Sagi Suryanarayana Raju) [26th April, 1955

ప్రభుత్వాన్ని కోరుతున్నాను. మరొక విషయము. National Extension Schemes ను మా జిల్లాకురెండింటిని యిచ్చారు. అందులో మా గ్రామము చాలా పల్లెటూరు ఉరట్ల అనే గ్రామంలో rur~l welfare scheme ను అమలులోకి తెచ్చి యిప్పటికి 7 సంవత్సరములయినది. Scheme క్రింద ఆప్రాంతంలో ఒక ఆఫీసుపెట్టి ఆఫీసర్లు సిబ్బంది అక్కడ పుంటూన్నారు. ఇదివరకు వుంటున్నవారు చాలా కష్టపడి పనిచేసేవారు. కాని యిప్పుడు క్రొత్తగా senior Tahasildar ను వేశారు. వీరు Deputy Collector కాబొయ్యే వారట. ఇటువంటివారు ఈ పల్లెలలోవుండలేక ఈ ఆఫీసును మా ప్రాంతానికి సంబంధంలేని నరసీపట్టణానికి shift చేయించుకున్నారు. ఇదివరలో 23-8-54 వ తేదీన Development Commissioner వచ్చినప్పుడు నన్ను వారు పిలిపించగా నేను వారితో ఈ scheme ను గురించి ప్రజలకష్టసుఖాలనుగురించి స్వయంగా మనవిచేసాను. మాకలెక్టరుగారు I.C S Officer, London నుంచి వచ్చినవారు. మనకు వారు చిక్కరు, నేను meeting లో ఒక resolution తెచ్చాను, వోటుతీసుకోండని వారికి చెప్పితే, వారు refuse చేశారు. వారు I C S. officer కాబట్టి, మాకు Collector గా వచ్చారు గనుక నేను అంతకంటే ఎక్కువవారితో మాట్లాడడానికి అవకాశంలేకపోయింది. తరువాత Block Development Committee meeting వచ్చింది. అది 17-10-54 వ తేదిన జరిగింది. అక్కడ ఈ ఆఫీసును విశాఖపట్నం మార్చడానికి resolution తీసుకోచ్చారు. ఈ resolution ఏకగ్రీవంగా pass చేశారు. అవిషయము ఆవిధంగా సర్దుబాటుచేశారు. ఈ విషయాలన్నింటిని ఉదహరించి 6-9-54 వ తేదిన గవర్నమెంటుకు నేను ఒక petition పెట్టుకుంటే, ఈ office ను మరల యిదివరకటి చోటికే re-transfer చేయమని ఆర్డరు పంపారు. అదిజరిగి, యిప్పటికి చాలాకాలమయింది. తరువాత గవర్నమెంటు పడిపోయి elections వచ్చినవి. ఈ elections లో ఈ మెంబరు మరల రాబోతాడా, ఎట్లాగో పోతాడు, మరలవస్తే చూద్దాము, అప్పుడు ఏ Independent మెంబరునో పట్టుకోవచ్చును, అని ఆ ఆఫీసును re-transfer చేయకుండా అక్కడనే వుంచారు. M.L.A. గా వున్న నాకు తెలియకుండా ఈ ఆఫీసును మా ఊరునుంచి shift చేశారు. ఆ ఆఫీసును విశాఖపట్నంకు తీసుకువెళ్లినదాకా నాకు తెలియవివ్వలేదు. తరువాత అక్కడవున్న contractors కున్నూ, ప్రజలకున్నూ, అక్కడ లోపాయికారి మనుష్యులకున్నూ చెప్పకొని canvass. చేసి వారిచేత petition లు వారికి పిలుగా యిప్పించడము మొదలుబెట్టారు. తరువాత నేను అదే మాటమీదనిలబడి అక్కడనే election లో నిలబడ్డాను. అక్కడ ప్రజలు నామీదవున్న నమ్మకముచేత, అభిమానముచేత నన్నే ఎన్నుకున్నారు. నన్నే తిరిగి ఎన్నుకున్నప్పటికినీ, ఆ officer గారికి నామీద యింకా దయరాలేదు. మొన్న 17-4-55 వ తేదిన block development committee meeting జరిగింది. ఆ meeting లో ఈ office shifting విషయము మరల నేను resolution move చేశాను. అప్పుడు యిదినా concern కాదు, అది Collector గారి concern గనుక యీ విషయం ఆయన deal చేస్తున్నాడని అన్నారు. I. C S. officer లు, planning officer లు, తాసీల్దారులు ఈవిధంగా ప్రవర్తిస్తూవుంటే యిక మన కర్మానికి, యిది ప్రజాప్రభుత్వమని చెప్పతున్నప్పుడు, ఈ ప్రభుత్వము ప్రజలకు మరేవిధంగా సహాయం చేస్తుందో చూద్దామని, ఆలోచించుకొని ఈ నాడు తమద్వారా, ఈ విషయాలన్నీ మంత్రివర్గానికి తెలియచేస్తున్నాను.

26th April, 1955] (Sri Raja Sagi Suryanarayana Raju)

ఇక Harijan uplift ను గురించి మనవి చేయవలసిన అవసరము ఎంతోవున్నది. కాని అధ్యక్షులవారు time అయిందని అంటున్నారు గనుక యింతటితో సెలవు తీసుకొంటున్నాను.

*Sri C. V. Somayajulu:—అధ్యక్షా, మొన్ననె అధ్యక్షుని ఎన్నిక విషయంలో అభినందన తెలుపుతూ శ్రీ P V.R.G. రాజుగారు అభినందనలతోపాటు ప్రతిపక్షీయులను కూడా సమాన దృష్టితో చూడమని కోరినంతమాత్రంచేతఆ సలహా untimely, ill-suited అనిచెప్పి కొంతమంది చెప్పలు అన్నారు. Ill-suited అయితే ఏమిచేస్తాం. దానికి నిదర్శనంగా అభినందన రిజల్యూషనును move జేస్తూ శ్రీ రాజేశ్వరరావుగారు కమ్యూనిస్టులమీద చేసినటువంటి దండయాత్ర, కాంగ్రెసు బలాన్ని ప్రకటించినట్టు ఒక పెద్ద వుపన్యాసం మనందరము విన్నతరువాత రాజుగారి కోరిక చాల క్రమమైనదని, న్యాయమైనదని రుజువైనసంగతి మనకందరకు తెలిసినదే. అందుచేత ఆ రకంగా కాకుండా ప్రతిపక్షీయుల అభిప్రాయాలు స్వీకరించి వారు చేసేటటువంటి సక్రమమైన policy ని సూచనలు ఆమోదిస్తే మన రాష్ట్ర ప్రజలందరికి ఉపకారం జరుగుతుం దనేటటువంటి నమ్మకంతో నేను యిక్కడ మాట్లాడుతున్నాను. అటువంటప్పుడు గవర్నమెంటు పాలసీకి సంబంధించి నంత వరకు సమర్దించవలెనా లేదా, అని ఆలోచిస్తే ఏరకంగా సమర్థించాలో అర్థం కావడంలేదు. ఇప్పుడు educational policy తీసుకుందాం. 'Educated unemployed' కు పని కల్పించేందుకు ఒకవేయి single teacher schools పెడుతున్నాం అని గవర్నరుగారు చెప్పారు. దానికి ముఖ్యంగా నేనుకూడా ప్రశంసించాల్సిన విషయం. నావంటి M. L. A. లకే గాదు, మినిస్టర్లకు కావలసిన కేండిడేట్లకు కూడా అద్దుతగిలేది వాళ్లేనని అందువల్ల వాళ్లని satisfy చెయ్యాలని తెలియజేస్తున్నాను. ఈ స్కూల్సు ఎలా పనిచేస్తున్నాయని చూచినప్పుడు వాటివల్ల ప్రజలకు వుపకారం జరుగుతున్నదా అని అనుమానం వేస్తుంది. మా శృంగవరపుకోట తాలూకాలో schools ఎత్తివేస్తున్నారు. శ్రీ సంజీవరెడ్డిగారు యిరిగేషను కాన్ఫరెన్సులో మాట్లాడుతూ మా ప్రాంతం రాయల సీమకన్నా అన్యాయంగా వున్నదన్నారు.

The Hon. Sri B. Gopala Reddi:—పేరు చాలా గొప్పగావున్నదే.

*Sri C. V. Somayajulu:—ఒకప్రక్క ఎలిమెంటరీ స్కూల్సును ప్రభుత్వం నిర్వహిస్తుంది అని చెబుతూవుండగానే closure orders వస్తున్నాయి. ఒక పెద్దమనిషి నిరశనవ్రతం కారణంగా స్కూల్సుకు కొంతవరకు time పెంచారన్నసంగతి మంత్రిగారికి తెలుసును. ఈ విధంగా extensions యిచ్చే బదులు యీ స్కూల్సును ప్రభుత్వం నిర్వహించాలని కోరుతున్నాను. శ్రీ సంజీవరెడ్డిగారు, శ్రీ ప్రకాశం పంతులుగారు మా ప్రాంతాన్ని చూశారు. కడకొండ స్కీముకు ప్లానింగు జరిగింది. పని ప్రారంభం కాలేదు. ఈలోగా ఎన్నికలు అయిపోయినాయి. ఆ విషయం ఏమీ పైకిరావడంలేదు. 18 వేల రూపాయలతో చింకలుగెడ్డ కాలువ తీయించారు. పని పూర్తి కాలేదు. డాము, రెగ్యులేటరు కట్టవలసివున్నది. ఇంకొక 16 వేలు sanction చేసినట్లయితే సక్రమంగా పని పూర్తవుతుంది. ఈ 16 వేలు ఖర్చుపెట్టకుంటే యిదివరకటి 18 వేలు దండుగై ఆ తాలూకాలో ప్రజలకు యేమీలాభం జరగకుండా పోతుందన్న విషయాన్ని గుర్తుంచుకొని ప్రభుత్వం వారు న్యాయంగా పనిచేస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

*Sri Raja V. V. Krishnam Raju Bahadur:—అధ్యక్షా, ఈ సభాస్థలిని గౌరవనీయులైన గవర్నరుగారు సభవారికి అందజేసిన సందేశమును అభినందించుచూ యున్నాను.

అందు ప్రభుత్వము రాష్ట్రములో జరుపబోయే దేశపురోభివృద్ధిని చేకూర్చే ప్రశంసనీయమైన హంశములు పొందుపర్చబడినందున అభినందించుచున్నాను. ప్రతిపక్షమువారు గవర్నరుగారి ఉపన్యాసమును విని విచారించుతూ యున్నామన్నారు. వారిని ప్రశ్నపూర్వకముగా తమద్వారా 'ఎందుకు విచారించుచున్నా' రని అడుగుచున్నాను. ఎందుచేతననగా మొదటి పంచవర్ష ప్రణాళిక రెండవ పంచవర్ష ప్రణాళిక లోను ప్రజా అభివృద్ధికరమైన సమస్యలు తీర్చడానికిగాను (1) development schemes (2) అనుసూచిత జాతులకు ఆర్థిక సాంఘిక పురోభివృద్ధిని చేకూర్చుటకు ఇండియా సంవిధానములో 275 సూత్రమునుబట్టి ఆ ప్రాంతముల ప్రజలకు అభివృద్ధికిగాను 18 లక్షల రూపాయలు ఖర్చు పెట్టుటకునూ, హరిజనులకు ఉచితముగా ఇండ్లవసతులకు బడ్జెటులో 2 లక్షల 30 వేల రూపాయిలు కేటాయించడము, (3) 60 లక్షలు రూపాయిలు చేనేతవారి పురోభివృద్ధికి ఖర్చుపెట్టుటకు ఏర్పరచి నట్లుగా ఉదహరించడము (4) ఇరిగేషన్ స్కీములకు 10 కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టుటకు ఇండియా గవర్నమెంటు వారివల్ల రాష్ట్రమునకు రాబట్టి దేశమును సస్యశ్యామలముగా చేయడానికి చర్యలు తీసుకొనుచున్నాము అని గవర్నరుగారు నివేదించినందులకు సంతోషించుటకు బదులు ఎందుకు విచారించుచున్నారు అని ప్రతిపక్షమువారిని ప్రశ్నించుచున్నాను.

ఇంతే కాకుండా వారు ఎందుకు విచారించుచున్నారో నాకు అర్థముకాకుండా యున్నది. సర్వమానవ సమానత్వము కోసము ప్రభుత్వము తలపెట్టిన కార్యకలాపాలు చూస్తూ కూడా విచారించ వద్దనిన్నీ సంతోషముతో సహకరించమని ప్రతిపక్షములోని సోదర శాసనసభ్యులను హెచ్చరికచేస్తూ యున్నాను.

పది రూపాయిలులోపు శిస్తును రద్దుచేస్తామని గత గవర్నమెంటు వాగ్దానము చేసిన దానిని అమలు జరపకుండుట తృప్తికరముగా లేదని ప్రతిపక్షమువారు విచారించుతూ యున్నామన్నారు. సాధారణముగా పన్నులేని భూమి ఏ గవర్నమెంటులోనూ ఏకాలములోనూ లేదనిన్నీ రామ రాజ్యములోకూడా షష్ఠభాగము పన్నుగా ఉండేదనిన్నీ తెలియజేస్తున్నాను. అందుచే శిస్తులేని భూమిని అత్యవసర పరిస్థితులువచ్చి నప్పుడు ప్రభుత్వము స్వాధీనపరచుకొనే పరిస్థితిలో సదరు భూమికి నష్టపరిహారము ఇవ్వవలసిన పరిస్థితి యుంటుందా అని ఆలోచించవలసి యుండెను. అందుచే ఇది ఒకవిధముగా రైతుకే ఎక్కువనష్టము చేకూర్చగలదు. ప్రస్తుత దేశపరిస్థితులనుబట్టి కోట్లకొలది ధనము ఖర్చుచేసి దేశాభివృద్ధిని చేకూర్చగల పరిస్థితిలో ప్రభుత్వము ప్రజలయొక్క వృత్తులపైన భూమిశిస్తుపైన ఆదాయము రాబట్టవలసినదేకాని ఇతరత్రా ఏవిధముగానూ ధనమును స్వీకరించవలసిన సంగతి ప్రతిపక్షమువారు సూచించి యుండలేదని అధ్యక్షులవారిద్వారా సభ్యులకు మనవి చేయు చున్నాను.

సోషలిస్టు పార్టీవారు కలివెన సత్యాగ్రహము చేసిన కారణంగా దేశములోని అన్ని ఇనాములు రద్దుచేయవలసినదిగా కోరిన కోరికనుగురించి గవర్నరుగారి ప్రసంగములో స్పష్టపర్చలేదని అందుకు విచా రించుచున్నామని ఈసభలో ఉద్ఘాటించిరి. వీరికి ఇనాములు ఎన్నిరకములు కలవో, ఏ పరిస్థితులలో ఇనాములు పుట్టినవో, ఏ ఇనాములను సంస్కరణ చేయవలసియున్నదో అన్నసంగతేతెలియక హైకోర్టు కలివెన ఇనాములు ఎస్టేటుకాదని తీర్పు ఇచ్చినప్పటికి సత్యాగ్రహము చేయడం న్యాయమైనది కాదని [illegible] క్రింద వచ్చినవేకాని, వేరొకటికాదు అని తెలియజేస్తున్నాను. ఇనాములో

[26th April 1955 (Sri Raja V. V. Krishnam Raju Bahadur)

whole village inams మైనర్ యినామములు, భటవ_్తి, సన్నది, దేశభందు, కై రాతి, దేవాదాయ, ధర్మాదాయ వగైరా అనేక తరహాలుగా మైనర్, మేజర్ యినామములు కలిగిఉన్న సందర్భములో ఒక్క సారిగా యినామములు రద్దుచేయాలని కోరడము సబబుకాదని తమద్వారా వారికి మనవిచేస్తూ Land Refoi ms ను గురించి యినామములగురించి, సాకల్యముగా చర్చించి అనతికాలములో సర్వజన ఆమోదము చేకూర్చే పద్ధతిగా చట్టముచేయుటనై ప్రభుత్వము యోచించుచున్నదని గవర్నరుగారి ప్రసంగములో యున్నప్పటికి అప్రస్తుతమైన నిందారోపణలు చేయడము తగదని తమద్వారా ప్రతిపక్ష సభ్యులకు మనవిచేస్తూ యింతటితో నా ఉపన్యాసమును విరమించుచున్నాను.

*Sri S. K. V. Kiishnavatharam :—అధ్యక్షా! నేనుకూడ శ్రీరాజేశ్వరరావుగారి అభినందన తీర్మానాన్ని బలపరుస్తున్నాను. గవర్నర్‌గారి ప్రసంగములో ఆరోగ్యానికి సంభంధించిన ప్రసక్తిలేదు. రాష్ట్రము మొత్తముమీద ప్రజారోగ్యాన్ని గురించి ఏవిధమైన చర్యలు తీసికొనదలచారో చెప్పలేదు. ప్రత్యేకంగా పశ్చిమగోదావరి జిల్లాలో చాల సమస్యలున్నాయి. వానిని గురించి కూడ గవర్నర్‌గారి ప్రసంగములో లేదు. పశ్చిమగోదావరిజిల్లాకు మంత్రిస్థానము లేకపోగా ఒక ప్రాజెక్టు ప్రస్తావనకూడా లేకుండా ఉండడము చాలశోచనీయము. ఏలూరులో పెద్ద హాస్పిటల్‌కట్టారు. కాని hospital లో తగినంత staff లేదు. E.N.T. and Eye లాంటి special departments లేవు. అది District head quarters hospital గా వున్నా, special departments లేకపోవుటచే ప్రజలకు చాలయిబ్బంది కలుగుతున్నది. చింతలపూడిలో హాస్పిటల్‌మాత్రమేవుంది. Hospital లో inpatients గా వుండడానికి ఎంతమాత్రము అవకాశములేదు. చింతలపూడి, తాడేపల్లిగూడెం hospitals ను ప్రభుత్వము తీసికొని inpatients కు అవకాశము కలుగజేసేటట్లు చూడాలని కోరుతున్నాను. ఇతర ప్రాంతాలలో 10 వేల జనాభావుండే గ్రామాలలో కనీసం గ్రామానికి ఒక hospital వుండేటట్లు చూడాలని నేను మనవిచేస్తున్నాను. ప్రతిపట్టణములో కూడ చాల మంది ఇండ్లకొరకు నానాబాధలు పడుచున్నారు. మునిసిపాలిటికి సంబంధించిన స్థలము లలో ఇండ్లు కట్టుకొన్నవాండ్లను ఆస్థలాలనుంచి evict చేస్తున్నారు. అదిపెద్ద సమస్యగా తయారవు తున్నది. ఇండ్లస్థలాలకుగాను తగినవి ర్పాటులు చేయవలసిందిగా నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత separation of judiciary from the executive ను గురించి కొంత మంది చెప్పారు. ఇదివరకే మన ప్రభుత్వం West Godavari జిల్లాలో ఈపద్ధతిని introduce చేశారు. ఇది చాలా సమర్థనీయంగా పనిచేస్తోంది. కాబట్టి కృష్ణ, గుంటూరు జిల్లాలలోను ఈ విధానం అమలులో లేని ఇతర జిల్లాలలోను enforce చేసి uniformity in procedure తీసుకు రావాలని కోరుతున్నాను.

పశ్చిమ గోదావరి జిల్లాలో ఎర్రకాలువ ప్రాజెక్టు, తమ్మిలేరు ప్రాజెక్టు ముఖ్యమైనవి. వీటిని కట్ట వలసియున్నది. గవర్నరుగారి Address లో major, minor and medium projects అనేది ఒక omnibus entry క్రింద ఉదహరించబడింది. దీన్ని క్రింద 10 కోట్ల రూపాయలనేది చాలా తక్కువమొత్తం. మరొక 10 కోట్ల రూపాయలు చేర్చి ప్రతిజిల్లాకు 1, 2 ప్రాజెక్టులు ఏర్పాటు చేయవలసి వుంటుంది. మన forest administration చాలా లోపంగా వున్నది. పేద రైతులు హరిజనులను పుల్లలుకూడా తెచ్చుకోకుండా harass చేస్తున్నట్లు తెలుస్తోంది. Forests

లో నుంచి రైతులకు కూలీలకు వ్యవసాయానికి పనికివచ్చే forest produce తెచ్చుకొనుటకు ఉచితంగా. గాని nominal గా పుల్లరి విధించిగాని సదుపాయాలు కలిగించాలని కోరుతున్నాను. ఇందులో అవి నీతిని అరికట్టడానికి ప్రభుత్వం steps తీసుకోవలసిందిగా మనవిచేస్తున్నాను. తాడేపల్లి గూడెమునకు అవసరమైన District Munsif's Court జిల్లాకు ఒక చివరగావున్న కొవ్వూరులో పెట్టినారు. దానిని తీసుకువచ్చి తాడేపల్లిగూడెంలో ఏర్పాటుచేయాలని కోరుతున్నాను.

*Sri T. G. Thimmayya Setty:—అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగంమీద రాజేశ్వర రావుగారి తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగంలో చాలా విషయాలు—దేశానికి, గ్రామాలకు, ప్రజలకు అనుకూలమైనవి— వున్నాయి. ఎలక్ట్రిసిటీ రేట్లనుగురించి చిత్తూరు సభ్యులుకూడాచెప్పారు. ఆదవాని తాలూకాకు మైసూరునుంచి electricity వస్తోంది. ఈ electricity రేట్లు పెంచడంవల్ల చిన్న పరిశ్రమలు, పెద్ద పరిశ్రమలు బాగా దెబ్బతిన్నాయి. త్వరలో పరిశ్రమలు వృద్ధిచేయాలనుకుంటూ ఈరకంగా దెబ్బతీయడం చాలా అన్యాయం. ఇదివరలో ప్రభుత్వం ఇచ్చినహామీలను క్రాలదోసి high tension rates 50%, lowtension rates 60%, 70% కు పెంచడంవల్ల పరిశ్రమలకు ఏ విధమైన సహాయంలేకుండా పోతుంది. వేలకొలది బావులకు current వాడుతున్నారు. వారు current వాడడానికి తక్కువ rates లో అనుకూలత వుంటుంది కాని ఇట్లా రేట్లు పెంచితేకాదు. దీనివల్ల రైతులకు ఇతర consumers కు కూడా చాలా దెబ్బతగులుతుంది. వ్యాపారం వృద్ధికాదు. పంటల ధరలు ఒకవైపున పడిపోతున్నాయి. వాటిని అరికట్టడానికి ప్రయత్నాలు చేయాలి. రైతులు మనదేశానికి వెన్నెముకవంటి వారని చెబుతూ ఈరకంగా వుంటే ఏమిలాభంలేదు. ఈ విషయాలను ప్రభుత్వంవారు జాగ్రత్తగా గమనిస్తారని ఆశిస్తూ గవర్నరుగారి ప్రసంగముపై వచ్చిన అభినందన తీర్మానాన్ని బలపరుస్తున్నాను.

* Sri G. Nageswara Rao :—అధ్యక్షా, రాజేశ్వరరావుగారి అభినందన తీర్మానాన్ని నేను బలపరచలేకుండావున్నాను. ఉభయ గోదావరి, కృష్ణా జిల్లాలలో లంకభూములు సాగుచేసుకునే పేదరైతాంగాన్ని గురించి labour societies ను గురించి గవర్నరుగారి ఉపన్యాసంలో లేకపోవడం చాలా విచారంగావున్నది. గత సంవత్సరం మేము అసంబ్లీలోను బైటకూడా లంకభూములను గురించి ఎంతో ఆందోళన సాగించాము. గోదావరిజిల్లాల్లో field labour co-operative societies మొట్టమొదటనుండి లంకభూములను బాగుచేసుకొని అభివృద్ధిచేసి ఎన్నోవందలు ఖర్చుచేసి ఎకరానికి 4 రూ. 7 రూ. పన్నుకట్టి సాగుచేసేవారు ప్రస్తుతం ఎకరానికి రు. 275 లు వరకు పాటతమూలంగా కట్టుకుంటున్నారు. అయితే ఈ సాగువల్ల ఎంతవరకు గిట్టుబాటు అవుతోందని చూస్తే ప్రతిసంవత్సరం రెమిషన్లకోసం దరఖాస్తులు పెట్టుకోవడం, ప్రభుత్వం grant చేయకపోవడం ఆస్తులను జప్తుచేయడం, జరుగుతోంది. ఈ పాటలుపాడే విధానాన్ని రద్దుచేసి lease కు ఇచ్చేపద్ధతి ప్రవేశపెట్టాలని లేబరు సొసైటీలు ఆందోళనచేశాయి. కాని ప్రభుత్వంవారు గుర్తించలేదు. లంకలను పాటకుపెట్టడంవల్ల societies వారు భూస్వాములతో పోటీచేయలేక లంకభూములను పొందలేక పోతున్నారు. వాటిని భూస్వాములే అనుభవిస్తున్నారు. 99% సొసైటీలలో హరిజనులున్నారు. హరిజనులను బాగుచేస్తామని ప్రభుత్వం ప్రయత్నాలు చేస్తోంది. దేవాలయం ప్రవేశంవల్ల కాదు హరిజనులను బాగుచేయడం. ప్రధానమైన ఆర్థికవిషయాలను ప్రభుత్వం గుర్తిస్తే హరిజనులను అభివృద్ధి చేయగలుగుతాము. భూస్వామ్యకవిధానం రద్దుద్వారాను, బంజరుభూములు

లంకభూములు పంపకం చేయడంద్వారాను హరిజనులకు మేలుచేస్తే వారికి 75% అభివృద్ధి కలుగ చేసినట్లు అవుతుంది.

అందుచేతనే లంకభూములను బంజరు భూములను పేదవారికి పంచే విధానమును పథకములో చేర్చమని విజ్ఞప్తి చేశాము. కాని అవి విలువైన భూములని, వాటి విషయము తరువాత ఆలోచిస్తామని కోటిరెడ్డిగారు ఆరోజున సెలవిచ్చారు గత సంవత్సరం తూర్పుగోదావరి జిల్లాలో 330 లంకలను పాటకు పెట్టినప్పుడు అందులో కొద్ది లంకలను మాత్రమే labour societies లకు lease కు యిచ్చారు. అవైనా, గత 3 సంవత్సరాల సగటురేటు కట్టుకుంటామన్న వారికే ఇచ్చారు. తక్కిన వాటినన్నింటిని వేలానికిపెట్టి భూస్వాములకు లప్పగించారు. ఈ సంవత్సరంకూడ పశ్చిమ గోదావరిలో 83 లంకలు పాటకువచ్చాయి. రెండు జిల్లాల్లోను లంకలు త్వరలోనే పాటకు పెట్టబడును. కనుక వెంటనే ఇప్పుడైనా ప్రభుత్వము చర్యతీసుకొని, ఆపాటలను ఆపుచేయకపోతే F.L.C సొసైటీలకు ఒక్క లంక కూడ దక్కదని, భూస్వాములే పాడివేస్తారని మనవిచేస్తున్నాను. గత మూడు సంవత్సరముల సగటు రేటు ఇస్తేనే లంకలను F L.C. సొసైటీలకు ఇస్తామని అంటున్నారు. అయితే, ఈ సొసైటీలు ఆ రేటుకు అంగీకరించలేకుండా వున్నాయి. ఎందుచేతనంటే 1953వ సంవత్సరంలో విపరీతమైన వరదలువచ్చి లంకలన్నీ ఇసుకమేటలు వేశాయి. అందుచేత గత సంవత్సరం యీ రేటు ఏమాత్రము గిట్టుబాటు కాలేదు అటువంటప్పుడు మూడు సంవత్సరాల సగటురేటు అంటే ఎకరాకు 275 రూపాయలు సెస్సులు కలుపుకొని అవుతుంది. అందుకని F.L.C. సొసైటీలు ఆ రేటుకు అక్కర లేదంటున్నాయి. ఆ మిషతో, వాటిని పాటకు పెడుతున్నారు. ఈ విధంగా లంకలు పేదవాళ్ళకు గాని, హరిజనులకుగాని దక్కకుండా వున్నాయి. అందుచేత వాటిని పాటకు పెట్టకుండా ఉండేటట్టు వెంటనే, చర్యతీసుకొని ఆ లంకలకు నామ మాత్రపు శిస్తుకట్టి ఈ labour సొసైటీలకు ఇస్తే చాల వుపయోగముంటుంది. F.L C. సొసైటీలకు గిట్టుబాటవుతుంది. అందుచేత ఎకరానికి 25 రూపాయలు రేటు మించకుండ కట్టి F.L.C. సొసైటీలకే యివ్వాలని, పాటకు పెట్టకూడదని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ పద్ధతినే గనక అవలంబించకపోతే పేదప్రజలు చాలా కష్టాలకు గురవుతారు. తరువాత ఈ labour societies కు lease కు యిచ్చే లంకలలో పొగాకు పండించ కూడదనే షరతు ఉన్నది. ఈ షరతువల్ల పొగాకు పండించకపోతే, సొసైటీలకు చాలా నష్టమువస్తూంది. కాని అదే లంకలు పాటకు పెట్టబడినప్పుడు భూస్వాములు పాడి పొగాకు పండించుకోవచ్చును. Labour సొసైటీలు మాత్రము పండించకూడదు. ఇది చాలా అన్యాయం. కనుక ఇటువంటి షరతు వెంటనే రద్దుచేయాలని కోరుతున్నాను. గత సంవత్సరము ఏర్పడిన లంకపంటల నష్టానికి తగిన రెమిషన్లు యివ్వకుండానే సాగుదార్ల ఆస్తి జప్తు—వేలము, జరుగుతూవుంది. రెమిషను పిటీషన్ల విచారణ జరిగేవరకు జప్తులు, వేలాలు ఆపుచేయాలని ప్రభుత్వము వారిని కోరుచున్నాను.

ఈ బంజరుభూముల విషయంలో గత అసెంబ్లీ చేసిన తీర్మానానికి ప్రభుత్వంవారు అనేక సాకులుచెప్పి, ఇంకా భూములు సర్వేకాలేదనో, విలువైన చెట్లుండే ప్రాంతములో చెప్పి చాలా భూమిని పంపకానికి రాకుండా నిషేధించడం జరిగింది. లేబరు సొసైటీలు ఆక్రమించుకొని 10,12,20 సంవత్సరాలనుంచి చేస్తున్న భూములను మాత్రమే పంపకంచేస్తున్నారు. తక్కినవన్నీ pending లో అనిశ్చితంగానేవుంచి, ఏవో కారణాలుచెప్పి పంపకం చేయడంలేదు. కనుక, ఈ బంజరు భూముల తీర్మానం అసెంబ్లీ ఆమోదించిన విధంగా అమలు జరపాలంటే

కమ్యూనల్ పోరంబోకులను, గ్రామ ప్రజలందరకు వుపయోగపడే భాగాన్ని విడిచిపెట్టి, మిగిలినదంతా పంపకానికి తీసుకోవచ్చు. ఈ రోజుల్లో ఎస్టేటు బంజర్లు అనేకం నిరుపయోగంగా ఉన్నాయి. వాటి నన్నింటిని పంపకానికి తీసుకోవాలి. సర్వే కాలేదని పెట్టిన నిషేధాన్ని రద్దుచేయాలి. అసెంబ్లీ తీర్మానానికి విరుద్ధంగా నందికొండ ప్రాజెక్టు దిగువ బంజరును అమ్మకానికి పెట్టడము అన్యాయం. ఇక, వ్యవసాయ కూలీల ఇండ్లస్థలాల విషయంలో గత మూడు సంవత్సరాలనుంచి నేను సుమారు 75 పిటీషన్లు సంజీవయ్యగారికి, కలెక్టరుకు పంపించాను. ఇంతవరకు బహుకొద్ది మాత్రమే enquiry కి వచ్చాయి. తక్కినవి enquiry కి రాలేదు. Enquiry చేయబడిన చోట్లనయినా యిండ్లస్థలాలకు acquire చేసి యివ్వకపోవడము జరుగుతూంది 1954–55 సంవత్సరంలో ఎన్నిఇళ్ళు ఇచ్చారో ఏమిచేశారో ఇంకా ఏమి తెలియడంలేదు. దాన్నిగురించి రిపోర్టురాలేదు. గత సంవత్సరం తూర్పుగోదావరి జిల్లాకు 1,90,000 రూపాయలు హరిజనుల ఇండ్లకు కేటాయించారు. పశ్చిమ గోదావరి జిల్లాకు 1,70,000 రూపాయలు కేటాయించారు. అయితే ఈ కేటాయించిన మొత్తం సరిగా వినియోగపడుతుందా అనే విషయాన్ని ప్రభుత్వము గమనించవలసి యున్నది. గత మూడు సంవత్సరాలుగా ఈ ఇండ్లస్థలాలుకొరకు వచ్చిన ధరఖాస్తుల enquiry పూర్తిచేయక కేటాయించిన మొత్తములో దాదాపు సగముభాగము ఖర్చుపెట్టకుండా జిల్లాకలెక్టరు ప్రభుత్వానికి surrender చేయడం జరిగింది. కొద్దిమొత్తము మాత్రమే ఇండ్లస్థలాల కొరకు ఖర్చుపెట్టబడింది. అందుచేత ఇటువంటి లోపము ఇక జరుగకుండా ఇందుకు కేటాయించిన మొత్తము పూర్తిగా సంవత్సరము ఆఖరుకు సద్వినియోగం చేయబడేటట్లు చూడవలసి యున్నది. కనుక ఇప్పుడు వచ్చిన పిటీషన్లన్నిటినీ వెంటనే enquiry చెయించవలసిందిగా కోరుతున్నాను. దీనికి ఎక్కువ ఆటంకముగా వున్న Land Acquisition Act ను కూడ వెంటనే సవరించాలి. గవర్నమెంటు పోరంబోకులులేక రైతులయొక్క భూమిని కొని ఇవ్వమని వ్యవసాయ కూలీలు అడుగుతున్నప్పటికి, రైతులు అమ్మడానికి అంగీకరించడములేదు. కనుక అస్థలాలు ఇవ్వడానికి వీలులేదని ప్రభుత్వము తెలియచేస్తూంది. గత మూడు సంవత్సరాలనుంచి ఈ Land Acquisition Act మార్చమని మేము అందోళనచేస్తూ ఉన్నాము. సంజీవయ్యగారు దాని విషయమై ఆలోచనచేసి దాన్ని సవరిస్తామని చెప్పారు. అచట్టాన్ని సవరించకపోతే పేదప్రజానీకానికి ఎక్కువమందికి ఇళ్ళస్థలాలు ఇవ్వలేమని మనవిచేస్తున్నాను. వారికి క్రొత్తఇండ్లస్థలాలు ఇవ్వడమే కాకుండా 20, 30 సంవత్సరాలనుంచి ప్రభుత్వ పోరంబోకులలో ఇళ్ళుకట్టుకొని నివసిస్తున్న హరిజనులకు, యితర కూలీలకు యింతవరకు ఎంత ఆందోళన జరిగినా యింకా పట్టాలు యివ్వలేదు. ఇప్పుడు వాళ్ళమీద గ్రామాధికార్లు, యింటిచుట్టు పెంచుకొన్న మొక్కలకు అధిక పెనాల్టీలువేసి బాధిస్తూన్నారు. కనుక అటువంటిదేమి జరుగకుండా వెంటనే ప్రభుత్వ పోరంబోకులలో వున్నవారికి పట్టాలను grant చేయాలి. భూస్వాముల స్థలాల్లోను, రైతుల స్థలాల్లోను అనేకమంది వ్యవసాయ కూలీలు కాపరముంటూ అనేకకష్టాలు పడుతున్నారు. ఇటువంటి వారందరకు వారున్న స్థలాలనుగాని యితర స్థలాలనుగాని ప్రభుత్వమువారు ఎక్వైరుచేసి యివ్వాలని కోరుచున్నాను.

Sri P. Kodandaramayya :—అధ్యక్షా, ఈ గవర్నరుగారి ప్రసంగము రెండు విభాగాలుగా ఉన్నది. వారు చేసినటువంటి విషయాలనుగురించి రెండవది ఇకముందు ఈ ప్రభుత్వము చేయబోయేటటువంటి విషయాలను గురించి ఈ ప్రసంగములో సూచింపబడినవి. ఈ సందర్భమున ముఖ్యంగా శ్రీరాజేశ్వరరావుగారి అభినందన తీర్మానాన్ని నేను ఆమోదిస్తున్నాను.

26th April, 1955] (Sri P. Kodandaramayya)

ఇకముందు ప్రభుత్వము చేయవలసినటువంటి విషయాలు గురించి కొన్నిసూచనలు చేయవలసిన అగత్యమున్నదని నేను భావిస్తూ వాటినిగురించి మనవిచేస్తున్నాను

ముఖ్యంగా ఎన్నికల విషయంలో, నా నియోజకవర్గంలో, అనగా పోలవరం నియోజకవర్గంలో జరిగినటువంటి విషయాలు అట్టే విశదముగా చెప్పనవసరంలేదు కాని ఒకమాట చెప్పతున్నాను. నా నియోజకవర్గంలో కొంతభాగం వెల్లడి, కొంతభాగము agency. Agency లో కోయదొరలు నివసిస్తున్నారు. వారు చాలా అమాయకులు. ముప్పయి సంవత్సరములనుంచి అక్కడ వాళ్లతో నివసిస్తున్నాను. వారందరుకలిసి డిసెంబరు 5 వ తేదీన దిప్పకాయలపాడులో సమావేశమై నన్ను తను నియోజకవర్గమునకు నిలువవలసిందిగా కోరారు. నా నియోజకవర్గంలోని అంతర్వేది గూడెం, దొరమామిడి గ్రామాదులలో కొత్తగా తెలంగాణానుంచి వచ్చినటువంటి కమ్యూనిస్టులు వారిపైన జరిపినటువంటి దారుణచర్యలకు భయపడి మీరు నిలువవలసిందని నన్ను వారు కోరారు. వారి కోరికప్రకారం దానికి నేను అంగీకరించి కాంగ్రెసువారికి దరఖాస్తుపెట్టితే, వారు నన్ను ఎన్ను కొన్నారు. ఇక నామీద ఏమిచెప్పడానికి వీలులేక, కోదండరామయ్య చచ్చిపోయాడు, ఆ కోదండరామయ్య వీడుకాదురా, ఎవడినో తీసుకునచ్చి ఇక్కడపెట్టారు అనిచెప్పి అకోయ అమాయకులలో ప్రచారంచేయడం జరిగింది. వాళ్ళు చాలామంది నమ్మారు. కొన్నిచోట్లకు నన్ను రావలసిందిగా కోరారు. అయితే ఒకసారి కోయవారు గనుక అలాగునమ్మితే రెండవసారి నమ్మడానికి అక్కడ కొన్ని చిక్కులుఉన్నాయి. అందుచేత నేను ఆప్రాంతాలకు వెళ్లలేదు. తరువాత ఒకచోట కాంగ్రెస్‌వాది ఒకరు నాకోసం ప్రచారం చేస్తున్నాడు. అయినకు ఒకచంపకాయి పడింది. ఏజెన్సీలో నన్ను ఏమనిషి ఒకమాట అనలేదు. అరోజు రాత్రి ఒకసంఘటనటి జరిగింది అక్కడ అవతల ప్రక్కన నా ఆఫీసు, ఇవతల కమ్యూనిస్టుపార్టీ ఆఫీసుఉన్నవి. అక్కడ చెట్టుమీద వారు జండా కట్టారు. జండాకట్టితే వూరందరువచ్చి నాతోచెప్పారు. అందుకు నేను "నన్నువాళ్ళు ఏమిచేయలేరు. వాళ్లతో మనకు తగాదావద్దు, మనమేమి అనవద్దు" అని చెప్పతూనేఉన్నాను. అలా ఉన్నప్పటికినీ, ఎక్కడినుంచో వచ్చిన చిన్నచిన్న కుర్రవాళ్లచేత అక్కడ రోడ్డుమీదనున్న రాళ్ళను ప్రోగుచేయించి నామీదకు కమ్యూనిస్టులు విసిరించారు. అయితే వాళ్ళు, పెద్దవాళ్ళు వయస్సువచ్చినవాళ్ళు కూడాకాదు. వాళ్ళు అక్కడ ఏజన్సీలోని కమ్యూనిస్టులని నేను అనను. కాని వాళ్ళు ఎక్కడినుంచోవచ్చారు. వాళ్ళచేత ఆరాళ్లను నామీదకు విసిరించారు. వారు ఆవిధంగా చేయించారంటే, అది సక్రమమో, అక్రమమో, మీరే గ్రహించాలని మనవిచేస్తున్నాను.

Sri E. Ayyapu Reddi:—అధ్యక్ష మహాశయా, నేను అలవనితంంపుగా మాట్లాడటానికి మీరు నాకు అవకాశమిచ్చినందులకు తొలుదొల్త మీకు నా అభినందనములు. గవర్నరుగారి ఉపన్యాసములోని 6 వ పేజి, 7 వ పేరా, నాల్గవలైనులో మా శ్రీశైలక్షేత్రమును గురించి చెప్పారు. ఈ శ్రీశైలక్షేత్రము చాలా పురాతనముగా ప్రసిద్ధికెక్కినక్షేత్రం. ఈ క్షేత్రానికి పోవడానికి తోర్నాల మరలచి కొత్తగా రోడ్డు వేస్తున్నామని చెప్పారు. ఈ క్షేత్రము నా నియోజకవర్గములో వుండుట చేతనూ, ఇప్పుడు గవర్నరుగారు యీ రోడ్డునుగురించి చెప్పినదానివల్లనూ, నేను వారికి నా ప్రత్యేక అభివందనములు తెల్పవలసిన అగత్యమువున్నది. ఈ క్షేత్రము చాలా పురాతనమైనదనిన్నీ, ప్రసిద్ధికెక్కినదనిన్నీ మనకందరికీతెలుసు. ఒకానొకప్పుడు శ్రీశైలక్షేత్రాన్ని శత్రువులు [illegible] వంద ర్శించారు. ఆక్కడ ప్రాకారాలతో కోటగూడా కట్టారు. అంతేకాకుండా అక్కడ [illegible]

ప్రతాపరుద్రుడు శ్రీశైల మల్లికార్జునిని దర్శనార్థంవెళ్ళుతూ, మధ్యమార్గంలో కరివెన అనే గ్రామం యీనాంగా స్వామికి యిచ్చారు. ఈ గ్రామం యీ దశాబ్దములో పూసపాటి విజయరామరాజ గజపతిరాజుగారి సత్యాగ్రహానికి రంగస్థలంగూడా అయింది. చారిత్రకంగా ప్రసిద్ధికెక్కిన యీ ప్రాంతము మానియోజక వర్గములో చేరివుంది. ఇది బహుశ ఆంధ్రదేశములోని నియోజకవర్గాల లోకల్లా పెద్ద దనుకొంటాను. 180 చతురపు మైళ్ల వైశాల్యముగలిగి వున్నది. ఇది ద్విసభ్య నియోజకవర్గము. ఇటువంటి నియోజకవర్గానికి యీనాడు ప్రాతినిధ్యము వహించే భాగ్యం నాకు లభించింది. ఇదిగాక కృష్ణా, తుంగభద్రా నదులతోకూడి, యింకను సప్తనదుల సంగమ ప్రదేశమైన అయిన సంగమేశ్వరమువద్ద సిద్దేశ్వరము ప్రాజెక్టుకు సంబంధించిన ప్రాంతమంతయు నా నియోజకవర్గ ములో చేరియున్నది. ఇటువంటి నియోజకవర్గానికి నేను ప్రాతినిధ్యమువహించిన సమయములోనే, గవర్నరుగారు తమ ఉపన్యాసములో శ్రీశైలానికి రోడ్డువేయబోతున్నామని చెప్పడము గూడా నాభాగ్య మేనని అనుకుంటున్నాను. గవర్నరుగారు యీరోడ్డు విషయము తెలిపినందుకు వారికి నా ప్రత్యేక అభి వందనములు తెలుపుతున్నాను.

ఇంతేకాకుండా యీ సిద్దేశ్వరం ప్రాజెక్టును ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడక పోయింది పోగా, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోగూడా వచ్చేటట్టులేదు గనుక, సిద్దేశ్వరము ప్రాజెక్టుకు బదులుగా ప్రభుత్వమువారు శ్రీ శైలక్షేత్రానికి రోడ్డు వేయడానికి పూనుకొనుట ఒక విధంగా మంచి దనే అంటున్నాను. మన ఆంధ్రదేశములోకల్లా ప్రసిద్ధిగాంచిన శ్రీ శైలక్షేత్రానికి దేశము నలు మూలలనుంచి యాత్రీకులు వస్తూవుంటారు. నల్లమల ప్రాంతంలో ఉత్పన్నమై ఎగుమతి అయ్యే వెదురు, కలప వగైరాలు తీసుకొని వెళ్ళేటందుకుగాను, రహదారి సౌకర్యాలు కలుగజేయడానికిగాను, సుమారు 70 మైళ్ళు కర్నూలునుంచి నంద్యాలవరకు రైలుమార్గము ఏర్పాటు చేయమనిన్నీ, యీ విషయంలో కేంద్ర ప్రభుత్వమువారికి సిఫార్సుకూడా పంపవలసిందిగా మంత్రివర్గమువారిని కోరాను. కాని వారికి యీ విషయములో ఇప్పట్లో అనుగ్రహము కలుగకపోయిననూ, ఇకమీదటనైనా అనుగ్రహము కలుగుతుందని విశ్వసిస్తున్నాను. ఇదే సందర్భంలో మరొక విషయము మనవిచేస్తాను. ఈ నల్లమల ప్రాంతంలో శ్రీ వరదరాజస్వామివారి ఆలయమునకు దగ్గరగా చిన్నచిన్న సెలవీళ్ళు చాలా ప్రవహిస్తూ వున్నవి. ఇక్కడ తొమ్మిదిలక్షల రూపాయలతో ఒక చిన్న ప్రాజెక్టు కట్టితే, చుట్టుప్రక్కల ఉన్న సుమారు ఇరవై గ్రామాలకు అన్నదానము ప్రభుత్వమువారు చేసినవారవుతారని, నేను యిదివర కెన్నో పర్యాయములు మనవిచేస్తూ, దీనియొక్క అవసరము, ఉపయోగము ప్రభుత్వముదృష్టికి తెచ్చి యున్నాను. అప్పట్లో శ్రీ సంజీవ రెడ్డిగారు ఉప ముఖ్యమంత్రిగా వుండగా, ఆ ప్రదేశాన్ని తనిఖీచేసి యింజనీర్లనుకూడ ఏర్పాటు చేశారు. వారు ఆ ప్రదేశమంతా గూడా తనిఖీచేసి ఒక రిపోర్టునుగూడా submit చేస్తూవున్నారు. శ్రీ రామకృష్ణ రాజుగారు minor irrigation విషయములో పదికోట్ల రూపాయలు ప్రభుత్వమువారు కేటాయింపు చేస్తూవున్నారు, నరేకదా, మరొక కోటిరూపాయలు కలిపి ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క కోటిరూపాయలు ప్రత్యేకంగా కేటాయింపు జేస్తే భాగుంటుం దని చెప్పారు. వారి అభిప్రాయముతో నేను ఏకీభవిస్తున్నాను. వెనుకబడిన జిల్లానుండి వచ్చిన వారైనప్పటికి శ్రీ రామకృష్ణ రాజుగారు అన్నిజిల్లాలకు సరిసమానంగా ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క కోటి రూపాయలు కేటాయిస్తే బాగుంటుందని చెప్పినందుకు వారియొక్క ఉదార స్వభావానికి నేను ఎంతో సంతోషిస్తున్నాను. అందుకు నేను వారిని అభినందిస్తున్నాను. వారు చెప్పినప్రకారము

ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క కోటి రూపాయలు కేటాయింపు చేసే పక్షములో, ఈ కోటి రూపాయలు వినియోగించడానికి ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క minor irrigation board ను ఏర్పాటుచేసి అందులో ఆ జిల్లాలోవున్న శాసనసభ్యులనుగూడా మెంబర్లుగా ఏర్పాటుచేస్తే వారు జిల్లాలో ఏయే minor irrigation schemes ఎక్కడెక్కడ అవసరమో, వాటియొక్క అవసరాన్ని ఉపయోగాన్ని బట్టి ఆ బోర్డులో వారు చర్చించుకొని బాధ్యతాయుతంగా ప్రవర్తించటానికి అవకాశము వుంటుంది గాబట్టి, ప్రభుత్వమువారు అటువంటి బోర్డును ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

ఈ సందర్భములో ముఖ్యంగా మా జిల్లాలో నంద్యాలనుంచి నంది కోట్కూరుకు ఒకరోడ్డు వేయడము అవసరమని మనవిచేస్తూ, ఒకరోడ్డు వేయించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇదివరకు రాయలవారి కాలంలో ఏర్పడిన రహదారి సౌకర్యాలుతప్ప యింతవరకు ఎన్ని ప్రభుత్వాలు మారినప్పటికిగూడా, యీ రెండుచోట్లకు వేరే రహదారి సౌకర్యాలు కల్పించబడలేదు. దారి పొడుగునాగూడా రాయలవారి కాలంనాటి శిలాశాసనాలు, పురాతనపు కోటగోడలు మాత్రమే వున్నవి. ఇవన్నీగూడా పూర్వపు ఔన్నత్యాన్ని సూచిస్తున్నవి. కాని యీ నాడు పురోగమిస్తున్న యితర ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు, యీ పురాతన సిధిలాలను, కోట గోడలను చూస్తూవుంటే, మాకందరికి చాలా బాధాకరంగా పూర్వపు ఔన్నత్యము పూర్వపు చరిత్ర మాకు జ్ఞాపకము వస్తూ వుంటున్నవి. ఈరోడ్డు రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిందని చెప్పారు. కాని దాన్ని త్వరితముగా తీసుకొని అమలు జరపమని ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

ఇకపోతే, మా ప్రాంతములో హరిజనులు, గిరిజనులు అనే వారియొక్క ప్రాముఖ్యతగూడా ఎక్కువగావుంటున్నది. హరిజన సంఖ్య, యీ నల్లమల ప్రాంతంలోవున్న గిరిజనుల సంఖ్య ఎక్కువగావుంటున్నది. వారినిగురించి ప్రభుత్వమువారు ప్రత్యేక శ్రద్ధతీసుకుంటూన్నారు. సంతోషమే. ఇదిగాకుండా హరిజన, గిరిజనోద్ధరణకంటే, వాస్తవముగా భిక్షుకజనోద్ధరణగూడా ఎందుకు జరగడములేదో నాకు కొంత విచారకరంగా వున్నది. 18, 19 శతాబ్దాలలోనే ప్రాశ్చాత్య దేశాలైన ఇంగ్లండు మొదలైనటువంటి దేశాలలో యీ భిక్షుకవృత్తిని మాపుచేయించారు. కాని 20 వ శతాబ్దములోగూడ మన దేశములో యీ భిక్షాటనఅది విరివిగావుండడము, సంఘాలలో అట్టడుగునవున్న యీ భిక్షుకజనానం ముఖ్యంగా కమ్యూనిస్టుల సాహిత్యానికి కావలసిన కధావస్తువులు, కావ్య వస్తువులు కావడం జరుగుతోంది. కాబట్టి భిక్షకజనాన్ని ఉద్ధరించటానికి ప్రభుత్వము యింతవరకు గూడా పూనుకోక పోవడము చాలా విచారకరంగావున్నది.

ఇక బంజర్ల విషయముచూస్తే దేశంలో ఎక్కడచూసినా అక్కడ ప్రతిజిల్లాలోనూ బంజర్లు విరివిగా వుంటున్నవి. వీటిని reclaim చేస్తూ, అక్కడ అనాధ శరణాలయాలనుగాని, యితర వసతి గృహాలు గాని ఏర్పాటుచేయటానికి ప్రభుత్వము పాటుపడతారని మేము ఆశిస్తూవున్నాము.

గవర్నరుగారు తమ ప్రసంగంలో ముఖ్యంగా K. C. Canal గురించి ఏ విషయమున్నూ చెప్పలేదు. కాని K.C. Canal కొరకు ప్రభుత్వం నాలుగుకోట్ల రూపాయలు ఖర్చుపెట్టి 1¼ లక్షల ఎకరాల భూమిని అదనంగా సాగుకు తీసుకురావడానికి చాలా త్వరితముగా పనులు చేయిస్తున్నారు. అందుకు మేము ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాము. అంతేకాకుండా గవర్నరుగారి ఉపన్యాసం కొరకు యీ సభ చాలా త్వరితముగా ఏర్పాటు చేయబడింది. [illegible] [illegible] వమా

వేశానికి ప్రభుత్వమువారి సంపూర్ణమైన ప్రణాళికలు శాసన సభ్యులకు వీలయినంత ముందుగా అందగలవని ఆశిస్తున్నాను. అప్పుడైనా ప్రజాస్వామిక పక్షాలకు ముఖ్యంగా చేదోడు వాదోడుగావుండి, సంపూర్ణ సహకారమిచ్చిన సామాన్యరైతుకు ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగింపజేసిన వారవుతారు. ప్రభుత్వమువారి ప్రణాళికలు రాబోయే బడ్జటు సమావేశానికి వీలయినంత ముందుగానే పూర్తి కాగలవని నేను విశ్వసిస్తున్నాను. ప్రభుత్వమువారు యిప్పటికైనా అమూల్యమైన యీ ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రయత్నము చేయడము చాలా ముదావహంగా వున్నదనే సంతోషముతో నేను గవర్నరు గారిని అభినందిస్తూ, రాజేశ్వరరావుగారు తెచ్చిన అభినందన తీర్మానాన్ని బలపరుస్తూన్నాను.

*Sri B. Subba Rao:—అధ్యక్షా, గవర్నరుగారు చేసిన ప్రసంగంలో రాజమండ్రి తాలూకాకు సంబంధించిన తొర్రిగెడ్డ పంపింగుస్కీము గురించి ఏమీలేదు. అది చాల ముఖ్యమైనటువంటిది. చాల అవసరమైనట్టిది. అది యిదివరకు ప్రభుత్వ దృష్టిలో వున్నదేకాని ఎందువల్లనో అమలు జరగలేదు. దానిని యీ మొదటి పంచవర్ష ప్రణాళికలోనికి తీసుకువచ్చే ఏర్పాటు చేయవలెనని కోరుతున్నాను. తరువాత హరిజనుల యిండ్ల స్థలాల విషయమై చాల కాలయాపన జరుగుతున్నది. అందువల్ల హరిజనులు చాల యిబ్బంది పడుతున్నారు. త్వరగా యిండ్ల స్థలాలు వచ్చేటట్లు ఆక్టు పవరించాలని కోరుతున్నాను. పోరంబోకు భూములను, అభ్యంతరంలేని భూములను హరిజనులు సాగుచేసుకోకుండా అధికార్లు అడ్డంకులు పెట్టడమువల్లను పెనాల్టీలు, వసూలుచేయడమువల్లను హరిజనులు నిరుత్సాహ పడుతున్నారు. అందువల్ల పెనాల్టీలు రద్దుచేయడానికి సాధ్యమైనంత త్వరలో ఉత్తరువులు జారీ చేయవలసినదని కోరుతున్నాను. లంకభూములను లేబరు సొసయిటీలకు 3 సంవత్సరముల సగటు రేటుమీద ఇచ్చేపద్ధతి వలన సొసైటీలకు చాల నష్టము కలుగుచున్నది. కాబట్టి సెటిల్మెంటు సొసైటీల రేటులకే lease కు యివ్వాలని కోరుచున్నాను. తరువాత నేషనల్ ఎక్స్టెన్షను స్కీముక్రింద half-contribution వసూలుచేస్తే హరిజనులు యిచ్చుకోలేరు. హరిజనులవద్దనుండి half-contribution వసూలు చేయడం సబబుకాదు. వెనుకబడినవారు కనుక half-contribution పద్ధతి హరిజనులయెడ రద్దుపరచి 4 వ వంతో 5 వ వంతో contribution నిర్ణయించాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri B. Appa Rao:—అధ్యక్షా, రాజేశ్వర రావుగారి తీర్మానాన్ని బలపరుస్తూ కొన్ని విషయాలు ప్రభుత్వానికి విన్నవించ దలచుకున్నాను. ప్రతిపక్ష నాయకులు, గౌరవనీయులైన శ్రీ సుందరయ్యగారు గవర్నరుగారి ప్రసంగానికి ఇచ్చిన ఎన్నికలకు సంబంధించిన సవరణ యీ శాసన సభకు ప్రభుత్వానికి censure motion గా నేను భావిస్తున్నాను. సుందరయ్యగారిని నేను ఛాలెంజి చేస్తున్నాను. అనకాపల్లి వస్తే అక్కడ కమ్యూనిస్టులు ఎన్నికల సందర్భంలో చేసిన దౌర్జన్యాన్ని రుజువుచేస్తాను. అలా రుజువు చేయలేకపోతే నేను నా సభ్యత్వానికి రాజీనామా యిస్తాను; రుజువయితే వారి సభ్యత్వానికి వారు రాజీనామా యిస్తారా? అని అడుగుతున్నాను. రుజువుచేస్తే వారిపార్టీ సభ్యులను ఉపసంహరించుకుంటారా అని అడుగుతున్నాను. అందుచేత వారి మాటలను ఉపసంహరించు కుంటారని ఆశిస్తున్నాను.

Sri P. Sundarayya:—ప్రభుత్వాన్ని enquiry పెట్టమనండి.

26th April, 1955]

Sri B. Appa Rao:—తమ ఓటమిని సమర్ధించు కోడానికి కమ్యూనిస్టులు సరి క్రొత్త నినాదాన్ని యివ్వడం మొదలుపెట్టారని చెప్పడానికి విచారిస్తున్నాను. అందుచేత జాగ్రత్త అని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. లోగడ అనుభవాలనుబట్టి ఒక విషయం మనవిచేయ తలచు కున్నాను. రాజధానిని కర్నూలులోను, హైకోర్టును గుంటూరులోను గత ప్రభుత్వం నెలకొల్పారు. మనకు వుండుకున్న కార్యాలయాలన్నీ మద్రాసులో వుండిపోయినందువల్ల చాల నష్టపోతున్నాం. గవర్నరుగారి ప్రసంగంలో అఖోగట్టా రాలేదు. నిష్పక్షపాతంగా శాసనసభవారుగాని ప్రభుత్వంగాని పరిశీలిస్తే కార్యాలయాలు తరలించేటందుకు తగిన పట్టణం ఒక విశాఖపట్టణమే అని రుజువవుతుంది. అందుచేత జిల్లాకు కావలసిన ఆఫీసులను విజయనగరం చేర్చి వాటి స్థలాల్లో విశాఖపట్నంకు వెంటనే ఆఫీసులు తరలిస్తే ప్రభుత్వ గౌరవం శాసనసభ ప్రతిష్ఠ నిలబడుతవని ఆశిస్తున్నాను. తక్షణం ఆ విధంగా చేస్తే ఆంధ్ర ప్రాంతాలలో మూడింటికి మూడు ప్రక్కల ఉన్నప్పటికి సమన్వయంచేస్తే గాంధీగారు చెప్పిన వికేంద్రకరణ సూత్రానికి అనుగుణంగా వుంటుంది కాబట్టి తక్షణం మద్రాసులోని ఆఫీసులన్నీ విశాఖపట్టణంకు తరలించుతారని ఆశిస్తున్నాను.

పోతే నేషనలిస్టు పార్టీ నాయకులు రామకృష్ణ రాజుగారు జమీందారీ ప్రాంతాలనుగురించి చెప్పిన దానితో నేను ఏకీభవిస్తున్నాను. అందులో అతిశయోక్తులు ఏమాత్రం లేవు. Minor irrigation విషయంలో జమీందారీ రైతులను రక్షించేందుకు కొన్ని సూచనలు చేశారు. అవి ప్రతిపక్షంనుంచి వచ్చినప్పటికి సహృదయంతో స్వీకరించి ప్రభుత్వం పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. లోగడ గోపాల రెడ్డిగారు స్థానిక పరిపాలన మంత్రిగా విశాఖపట్నం జిల్లాలో శంకుస్థాపన చేసిన శారదావది ప్రాజెక్టు ఆ స్థితిలోనే ఉండిపోయింది. ఇంకా విశాఖపట్నంలో సంగమల ఆనకట్ట, ఆరండేల్ డామ్ గురించి విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ విషయాలనన్నింటినీ పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగంలో విశాఖ జిల్లాలోని ఒక ప్రాజెక్టుకూ స్థానం లేకపోవడం విచారకరం.

ఎన్నికలు సక్రమంగా జరిగాయనీ, ప్రతిపక్ష మిత్రులు చెప్పినవి సరికాదని మనవి చేస్తున్నాను. తరువాత మద్యపాన నిషేధంలో, ఆ శాఖను రద్దుచేసుకొమ్మని, ఆభారం ప్రజలపైన వేయమని మనవిచేస్తూ ఈ తీర్మానాన్ని బలపరుస్తూ విరమిస్తున్నాను.

Sri V. Visweswara Rao:—అధ్యక్షా; గవర్నర్‌గారి ప్రసంగముపై రాజేశ్వరరావుగారు ప్రతిపాదించిన తీర్మానాన్ని బలపరచలేనందుకు నేను విచారిస్తున్నాను. ఈ చర్చలలో ఎన్నికల ప్రస్తావన వచ్చింది. ఎన్నికలు సక్రమముగా నడిపారని, కమ్యూనిస్టుపార్టీ మాత్రము సక్రమమైన మార్గమును అనుసరించలేదని శ్రీ అప్పారావు, రమణయ్యగార్లు మాట్లాడారు. అంతలో శ్రీ రమణయ్య నాయుడుగారు మాట్లాడుతూ కమ్యూనిస్టులు ఏవిధముగా ప్రచారము చేసినది ఉద్ఘాటించారు. వారు మాట్లాడిన విషయాలేవియు మా మానిఫెస్టోలో లేవు. మా మానిఫెస్టోకు ఎంత వక్రభాష్యం చేసినారు అనేదానికి యిప్పటివారి ఉపన్యాసమే తార్కాణము. అంతేకాదు. ఎన్నికలలోను, ఎన్నికలు అయిన తర్వాత కూడ కృష్ణాజిల్లాలో కాంగ్రెస్‌వారు చేసే పద్ధతులుచూస్తే యదార్థ విషయాలు బోధ పడుతాయి. ఈనాడు కూడా పోలీసువారు కేసులను తర్యారుచేసి, కమ్యూనిస్టులు కాదు అని చెప్పినా కూడ కమ్యూనిస్టులు చేస్తున్నారు అని ప్రసంగించడము చాల విచారకరము. శ్రీ అప్పారావుగారు మాట్లాడుతూ నూజివీడులో తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడను కమ్యూనిస్టులు పొడిచారన్నారు.

(Sri V. Visweswara Rao) [26th April, 1955

తనను పొడిచింది కమ్యూనిస్టులు కాదు అని ఆయన చెప్పినా, తనను పొడిచింది కమ్యూనిస్టులేనని ఒప్పించుటకు ఎంత ఒత్తిడి తీసుకొచ్చారో శ్రీ అప్పారావుగారినే గుండెమీద చేయివేసుకుని చెప్పమనండి.

మరియొక విషయం; నూజివీడు తాలూకా మునునూరు గ్రామంలో ఎవరో దొంగలు కొంత మంది కొన్ని ఇళ్ళపై బడ్డారట. ఈ అవకాశం తీసుకుని కమ్యూనిస్టులు ఇళ్ళపై దాడిచేశారని పోలీసులకు రిపోర్టులిచ్చారు. పోలీసులు వచ్చి ఆ గ్రామంలో విచారణ జరుపుతూ వుండగా మరునాడు రాత్రి ఎవరో వ్యక్తివాగులో 20 మంది కాకినిక్కర్లతోను, తుపాకులు, కర్రలతోను వున్నారని చెప్పగానే వెంటనే పోలీసులు గ్రామస్థుల సహాయసహకారంతో వాగులోయున్న సంఘద్రోహులను పట్టుకోవటానికి పూనుకోవాలి గదా! అందుకు ఉద్యమించారా? లేదు. అలా చేయకుండానే చుట్టుప్రక్కల గ్రామాలలో యున్న కమ్యూనిస్టుల ఇళ్ళపై అర్ధరాత్రివేళ పోలీసులు దాడి జరిపారు. కమ్యూనిస్టులందరు తమ ఇళ్ళవద్ద ఉండటం చూచి, వాగులోనివారు కమ్యూనిస్టులు కాదని నిర్ణయించుకున్నారనుకుంటాను. ఇదేనా నిష్పాక్షికదృష్టితో గావించే పరిపాలన! పాక్షికదృష్టిని ఎన్నికల అనంతరం కూడాకొనసాగించడం శోచనీయం. ఎన్నికలు పూర్తి అయినవి. ఇకనైనా ప్రభుత్వం పాక్షికదృష్టికి స్వస్తిచెప్పడం అవసరం. కాని ప్రభుత్వం అవిధానమునే అమలుజరుపుతున్నది. ప్లానింగు కమిటీల నియామకంలో ఇదింకా శాశ్వతమవుతున్నది.

ఈనాడు మనదేశము ఎంతో అభివృద్ధి చెందాలని మొదటి పంచవర్ష ప్రణాళికను పూర్తి చేస్తూ రెండవ పంచవర్ష ప్రణాళికకు ప్రాతిపదికలు తయారుచేస్తున్నారు. జిల్లా ప్లానింగ్ కమిటీలు పథకాలను తయారుచేస్తున్నాయి. గ్రామ, తాలూకా కమిటీలను ఏర్పాటుచేసే సందర్భములో కమ్యూనిస్టులను సభ్యులుగా నియమించడంలేదు. తాలూకా కమిటీలను గ్రామ కమిటీలను నియమించడములో ఎక్కువగా ప్రభుత్వ పార్టీనే దృష్టిలో పెట్టుకొని పాక్షికంగా కమిటీలు నియామకం జేయడము జరుగుతున్నది. ఆ కమిటీలు కమ్యూనిస్టుల సహకారము కూడ పొందడానికి కృషిచేయాలని కోరుతున్నాను. గ్రామతాలూకా కమిటీలను నియమించేటప్పుడు తగిన వ్యక్తులను తీసికొనవలసిందని కోరుతున్నాను. మెట్టప్రాంతాలలో అక్కడి గ్రామస్థులను మీరు సగము డబ్బు యివ్వాలని అడుగుతున్నారు. కాని వారు శ్రమరూపములో సహకారం యివ్వగలరు కాని డబ్బు రూపములో యివ్వజాలరు. నేనొక ఉదాహరణ చెప్పతాను. ఒక గ్రామంలో ప్రభుత్వంవారు బావి కట్టాలంటే సుమారు 6 వేలు ఖర్చు అవుతుంది, కాని గ్రామములో మంచినీటి బావిని త్రవ్వడానికి 6 వందలు మాత్రం ఖర్చు అవుతుంది. కాని 3 వేల రూపాయలు యివ్వాలని అడుగుతారు ఇంత డబ్బు గ్రామస్థులు ఇవ్వలేరు. కాని శ్రమదానం రూపంలో యివ్వమన్నా ఆ 5 వందల పనిని యివ్వగలుగుతారు. ప్రాంతాలలో గ్రామస్థులు సగము యివ్వాలనడము సరియైన విధానము కాదు. అదేవిధముగ అనేక ప్రాంతాలలో రైతాంగము అనేక కష్టాలుపడి 5, 6 సంవత్సరాలుగా సాగుచేస్తున్న భూములనుండి, అక్కడ అడవులు పెంచాలని వెళ్ళగొట్టడము న్యాయముకాదు. వాటిని వదలకపోయినట్లయిన పెనాల్టీలు వసూలు చేయడము జరుగుతున్నది. పోరెస్టు భంజర్లను బీద ప్రజానీకానికి పంచాలని కోరుతున్నాను.

బుడమేరు స్కీమును అమలుపరచాలి. బుడమేరుకు వరద వచ్చినప్పుడు అనేక వేల యకరాలు ముంపుక్రింద నష్టమవుతున్నది. దానికొరకు రిజర్వాయరు కట్టి, diversion dam లు కట్టాలి.

ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో శ్రీ రాజాజీ ప్రభుత్వం ఉండగా బుడమేరు వరదపీడిత రైతాంగం బుడమేరు diversion scheme నకుగాను contribution గా కొంత డబ్బు ఇస్తామని మెమొరాండమును ఇచ్చారు కూడాను. ఆ మెమొరాండముపై విచారణ మాత్రం ప్రభుత్వం కొంత సాగించుచున్నదేగాని ఈ మూడు సంవత్సరాలనుండి scheme ను వాయిదా వేయుటయు జరుగుతున్నది. ఇంకొక విషయం చెప్పవలసియున్నది. ఈనాడు బీదప్రజలు ఇండ్ల స్థలాలకుగాను చాల యిబ్బందులు పడుచున్నారు. మా కలవపాముల గ్రామంలో 14 సంవత్సరాలనాడు ఇండ్ల స్థలాలకు గామ వ్యవసాయ కూలీలు 820 రూపాయలు కట్టారు. ఏదో ఒక objection పెట్టి వాయిదా వేస్తూ ఇంతవరకు ఇండ్లకు స్థలాలు యివ్వలేదు. ఈ రూపంలో ప్రభుత్వముయొక్క విధానము జరుగుతున్నది. అందుచేత గవర్నర్‌గారి ప్రసంగాన్ని ఆమోదించలేకపోతున్నాను.

*Sri P. Ramacharyulu:— అధ్యక్షా, గవర్నరుగారిని అభినందిస్తూ ప్రతిపాదించబడిన తీర్మానాన్ని బలపరుస్తున్నాను. ఈ ఎనిమిది నిముషములలో అనుకొన్న అనేక విషయాలు చెప్పడం ఎట్లా సాధ్యం కాదో, అట్లాగే గవర్నరుగారుకూడా చిన్న పుస్తకంలోని వారి ఉపన్యాసంలో అనేక విషయాలు చెప్పడం సాధ్యంకానిపని. ఎన్నో విషయాలు ఇందులో ఉండకపోవచ్చును. కాని చెప్పిన విషయాలు చాల ముఖ్యమైనవి. మనం ఒక్కొక్క జిల్లాకు, తాలూకాకు కావలసినవి చెప్పకుంటున్నాము. కాని సమగ్రమైన ఆంధ్రరాష్ట్ర అభివృద్ధిదృష్టిలో పెట్టుకొని గవర్నరుగారి ప్రసంగంలో కార్యక్రమములు సూచించబడినవి. ఒకరుచెప్పే విషయాలు మరొకప్రాంతంవారికిబాగా తెలియవు. మీరు చెప్పే లంకలు, బుడమేరు వరద సమస్యలు మాకు తెలియవు. మా క్షేమ పరిస్థితి మీకు బోధపడదు. ఆ ప్రదేశంవారు ఈ ప్రదేశంలోను, ఈ ప్రదేశం వారు ఆ ప్రదేశంలోను సంచారం చేస్తే ఒకరి పరిస్థితులు ఒకరికి తెలుస్తాయి. అందుచేత M. L. A. లకు రైల్వే ఫ్రీ పాసు ఇచ్చి సంచార సౌకర్యాలు యేర్పాటు చేయడానికి పూనుకోవాలని నా సలహా. ఇక నేను ఆంధ్రరాష్ట్రం యొక్క జాగ్రఫీని గురించి రెండు విషయాలు చెబుతాను. బెంగుళూరు చల్లగా వుంటుందని మనకు తెలుసు. కర్నూలునుంచి బెంగుళూరు 220 మైళ్ళు, బెంగుళూరు 3000 అడుగులు ఎత్తున ఉన్నది. అంటే కర్నూలునుంచి బెంగుళూరువరకు మైలుకు 10 అడుగులు చొప్పున హెచ్చుతూ పోతోంది. ఆ పీఠభూమిలో నుంచి నదులు మిద్దెమీద నుండి వాన నీరు పడిన మాదిరిగా ప్రవహిస్తున్నాయి. ఈ కారణముచేత ఆ నదులు సంవత్సరానికి 109 గంటలు మాత్రము పారుతున్నవని లెక్కవేశారు. అందుచేత ఈ ప్రాంతంలో పూర్వులు అక్కడక్కడ చెరువులుకట్టి వర్షపునీరు నిలువ చేయడానికి ఏర్పాట్లు చేశారు. అందుకే ఇక్కడ చెరువులు గుంటలు ఎక్కువగా ఉన్నవి. ఈ నదు అన్నింటిలోకూడా, తుంగభద్రలో తప్ప తక్కిన వానిలో ఇసుక, రాళ్ళుతప్ప నీళ్ళు వుండవు. ఏ 12 రోజులో నీళ్ళు వుంటాయి. తుంగభద్ర జీవనది, తుంగ, భద్ర అనే రెండునదులు హరిహరమునకు పైన కలిసి తుంగభద్ర అయినది. ఈ ప్రాజెక్టు కట్టాలని 50 సంవత్సరాలుగా ప్రయత్నం చేస్తున్నాం. మల్లాపురం దగ్గర తుంగకు భద్రకు ప్రాజెక్టు కట్టారు. మిగిలిన నీళ్ళు-మనకు వస్తున్నాయి. హైదరాబాదు రాష్ట్రంవారితో చెరి సగంనీరు ఇచ్చేటట్లుగా ఏర్పాట్లు చేసుకున్నాము. తుంగభద్రనదిపైగల ప్రాజెక్టులకు నీరుపోగా, హైదరాబాదునకు మిగిలినదానిలో సగంపోగా తక్కిన నీరుమనకువస్తుంది. బళ్ళారి ప్రాంతం మైసూరుతో చేరింది. అందువల్ల బళ్ళారిదిగువ మన్న క్రిందికాలువలు మనవి. ఎవరికి నీరు అంతగా అక్కరలేదో అంటే రేగడి నేలలవారికి, నీరు ప్రవహిస్తోంది. నీళ్ళుకావలసిన ఎర్రనేలభూమ్లకు నీళ్ళులేవు. "తుంగభద్రలోని నీళ్ళు రైతులు వాడు

(Sri P. Ramacharyulu) [26th April, 1955

కోవడంలేదు. నీళ్ళను వాడుకునేటట్లు చేయాలని ఉపన్యాసాలు చెప్పారు. రైతులకు నీళ్ళు వాడుకోవలసిందని వేరేచెప్పనక్కరలేదు. కర్నూలుమీదుగా విమానాలు ఎగురుతవి. ఢిల్లీ వెళ్లేవాళ్ళకు రైలు విమానంకూడా వున్నవి కదా. రైలులోనే ఎందుకు వచ్చినావు అని అడిగితే ఏమి చెబుతాము? విమానం దిగడానికి కర్నూలులో విమానాశ్రయం కావాలికదా అంటాము. భూములకు నీరుపారే చిన్న కాలువలు లేకుండా తుంగభద్రనీళ్ళు తీసుకోలేదంటే ఏమిలాభం? నేను అమ్మన్న రాజాగారికి చెప్పేది ఏమిటంటే, వారి డెల్టాప్రాంతంలో భూమి చదునుగావుంటుంది. మాభూమి ఎత్తుపల్లాలుగా వుంటుంది. ఒకఎకరానికి నీరు పారవలెనంటే ఎంతో ఖర్చుచేసి లెవల్ చేయాలి. ఈ విషయములో రైతు చాల కష్టపడి ఎక్కువ ఖర్చుచేస్తేనేకాని భూములకు కాలువనీరు పారించుకొనుట జరుగదు. నీరుఎందుకు పెట్టుకోరంటే దానికి తగిన సౌకర్యం లేదు కనుక పెట్టుకోరు. రామకృష్ణ రాజాగారు చెప్పినట్లుగా వెనుకటి చెరువులు గట్లుతెగి నీళ్ళు లేకుండాపోయినవి మా జిల్లాలలో. ఈ ప్రాంతాల్లోనికి నీరుదిగిరాకుండా మైసూరువారు పైన అరికట్టారు. మైసూరు వారు వాణీసాగరం అనే ఆనకట్టను హగరి నదిపై కట్టారు. ఆ నీరును రైతులు ఉపయోగించడం లేదు. అయినా నీటిని కిందికి వదలరు. ఈ గవర్నమెంటువారు, ఆ గవర్నమెంటువారు సంప్రదించి నీరు మళ్ళించవలసిన ఆవశ్యకతను నచ్చచెబితే బాగుంటుందని సలహా ఇస్తున్నాను. మైసూరువారు బళ్ళారి విషయంలో బీష్మించుకొన్నారు. విద్యుచ్ఛక్తి మా గ్రామాలకు ప్రక్కనేపోతుంది. మైసూరు గ్రామాలకు వాడుచున్నారు. అయితే మాకు విద్యుచ్ఛక్తి లేదు. దాన్ని ఇవ్వాలని మనం అడిగితే వాళ్ళు ఇవ్వడంలేదు. ఈ విషయంకూడా మైసూరు గవర్నమెంటు వారితో నచ్చచెబితే బాగుంటుందని మనవి చేస్తున్నాను. ఇంక ప్రజారక్షణ గురించి కొంత చెప్పవలసి ఉన్నది. మా ప్రాంతంలో హత్యకూడ ఎక్కువగా వుంటుంది. సర్కార్లలో కమ్యూనిస్టులవల్ల చాలా బాధలు పడుతున్నారు అని చెప్పారు. నాకు చాలా నవ్వుగా వున్నది. మా ప్రాంతాల్లో ఎలక్షనయిన మరు రోజునవే ఒక హత్య జరిగినది దోపిడి జరిగింది. కల్యాణదుర్గంలో 1000 మంది కమ్యూనిస్టులుచేరి పన్నులు వసూలుచేయు నెపముతో అలజడి కల్పించారు. ఇన్నిబాధలు మేము పడుతుంటే మీ సంగతులు వినడం ఆశ్చర్యంగా వున్నది. పోలీసువారు మాజిల్లాలో అంబేద్కరుగారి కంటే ముందుగానే బౌద్ధమతం తీసుకున్నట్లు వున్నది. వారు పూర్తిగా అహింసావాదులు అయినారు. ప్రజలకు రక్షణ అనేది ఇవ్వాలి. రక్షణ ఇవ్వలేకపోతే ప్రభుత్వంవుండి ప్రయోజనంలేదు. గ్రామాలకు మంచినీరు కావాలనేది మరొక ముఖ్యమైన సంగతి. తుంగభద్రకాలువ త్రవ్వితేనే, కర్నూలు బావులలో నీరు లేకపోయినది. హరిజనులకే కాదు. సవర్ణులకే నీరులేని చోట్లు మా ప్రాంతంలో చాలఉన్నాయి. ఈ విషయం సంజీవరెడ్డిగారికి తెలుసును. బండికట్టుకుని మూడుమైళ్ళుపోయి ప్రతిదినం వదికడివల నీళ్ళు తెచ్చుకునే గ్రామాలున్నాయి. ఇటువంటి గ్రామాలకైనా మంచినీళ్ళు ఇచ్చు ఏర్పాటు చెయ్యాలని కోరుతున్నాను.

*Sri P. Gunnayya:—అధ్యక్షా, గవర్నరుగారి ఉపన్యాసముపైన నిన్నటినుంచి చర్చ జరుగుచున్నది. ఈ సందర్భమున శ్రీ మల్లెపూడి రాజేశ్వరరావుగారి అభినందన తీర్మానమును నేను బలపరుస్తూ గవర్నరుగారికి నా హృదయపూర్వక వందనములు అర్పిస్తున్నాను. తుంగభద్ర నందికొండ ప్రాజెక్టులు మన ఆంధ్రదేశములో పెద్ద ప్రాజెక్టులు. భూమిపై ప్రవహించు నీరు వృథాగా సముద్రములో కలిసిపోకుండా అటువంటి ప్రాజెక్టులు, రిజర్వాయర్లు కట్టి ప్రజలకు నీటి సప్లయి

26th April, 1955] (Sri P. Gunnayya)

కలుగజేయ సంకల్పించినందుకు ఆంధ్ర ప్రభుత్వానికి నా హృదయపూర్వక వందనము లర్పిస్తున్నాను కాని, ఎన్నో సంవత్సరములనుంచి ప్రజలు ఆందోళన చేస్తున్నటువంటి వంశధార ప్రాజెక్టును నిర్మించు విషయంలో గొట్టదగ్గర రిజర్వాయరు ఏర్పాటు చేసినందుకు పాతపట్నం తాలూకా తరఫున నా విచారమును తెలుపుచున్నాను. ఎందుకనగా, నేను ఇంతవరకు శ్రీకాకుళంలో ఉన్నప్పటికి పాతపట్నం ఎరుగనటువంటి వాడను. అది కొండ ప్రదేశము, చాలా వెనుకబడి నటువంటి ప్రదేశము కూడాను. ఆలాంటి ప్రదేశములోకూడ అక్కడ ఒక రకమైన విలువగల భూమి ఉన్నది. ఒక ఎకరా కనీసము మూడు వేల రూపాయలు ఖరీదు చేసే టటువంటి భూమి ఉన్నది. అటువంటప్పుడు గొట్ట దగ్గర రిజర్వాయరు కట్టనట్లయితే, సుమారు 30 వేల ఎకరాలకు చాలా నష్టము కలుగుతుంది, 30 గ్రామాలుకూడ మునిగిపోతాయి. అలాంటి విషమ పరిస్థితి ఏర్పడకుండా, ప్రజలకు మేలుచేయ దలచుకొన్న ప్రభుత్వము, గొట్టదగ్గర ఒక రెగ్యులేటర్, మదనాపురంవద్ద, ఒక రెగ్యులేటర్, సింగిడివద్ద ఒక రెగ్యులేటర్ ఏర్పాటుచేసి ప్రజలకు నీటి సప్లయి చేసినట్లయితే చాలా బాగుంటుందని, ఆవిధంగా చేయవలసిందవి హృదయపూర్వకముగా ప్రార్థిస్తున్నాను. అలా చేయక పోయినట్లయితే ప్రజలనుండి చాలా ఆందోళన బయలుదేరుతుంది. మొన్ననే, 17వ తేదీనాడు కొమ్మన పల్లెలో ఒక మహాసభ జరుపబడింది. అక్కడికి 5,6 వేలమంది జనం వచ్చి ఉండినారు. అప్పుడు ప్రజలు ఈ విషయంగురించి చెప్పారు. గొట్టదగ్గర రిజర్వాయరు కట్టినట్లయితే ఆ గ్రామాలు చాలా మునిగిపోతాయని, కనుక ఆ విధంగా చేయకూడదని విజ్ఞప్తి చేశారు. అంతేకాకుండా "లక్ష్మన్‌దానుకు, మీకు వోట్లుఇచ్చి పంపించాము, కనుక మాకు నష్టంలేకుండా ఇతర ప్రజలకు ఇబ్బందిలేకుండా చూడవలసిం"దని agitate చేశారు. అందుచేత, పూజ్యులైనటువంటి గోపాల రెడ్డిగారు అక్కడి రైతులయొక్క కష్టసుఖాలను ఎరిగినటువంటి officials, non-officials తో ఒక కమిటీ ఏర్పాటుచేసి ఆ కమిటీద్వారా అక్కడ ప్రజలకు దీనివల్ల ఎంతవరకు నష్టము వస్తుందో పరిశీలించి, ప్రజల ఇబ్బందులను తొలగిస్తారని ఆశిస్తున్నాను.

ఇంతేకాక, పాతపట్టణం తాలూకాలో సుమారు రెండువేలచెరువులు ఉన్నవి. రోడ్లుకూడా చాలా ఉన్నవి. బొబ్బిలిరాజా చీఫ్ మినిస్టరు ఏలాగయ్యాడో, ఆ విధంగా పర్లాకిమిడి మహారాజా Central Government లో ఒక Member అయి, ఆయన ఈ ప్రాంతములో తిరగడానికి చాలా రోడ్లు అప్పుడు జమీందారీ కాలములో వేశారు. ఆ రోడ్లు ఇప్పుడు ఏమి బాగలేవు. బండ్లు వెళ్ళడానికిగాని, మనుష్యులు వెళ్ళడానికిగాని చాలా కష్టంగా ఉన్నది. దానివల్ల ప్రజలు చాలా ఇబ్బందులుపడుతున్నారు. అంతేకాక వాగావళిపై ప్రక్కన 3 వందల గ్రామాలున్నాయి. ఒరిస్సా బోర్డరులో అవతల 2 వందల గ్రామాలు ఇవతల ఒక 3 వందల గ్రామాలు ఉన్నది. ఇవతల వాళ్ళు అవతలకు పోవడానికిగాని, అవతలవాళ్ళు ఇ[illegible] రావడానికి వీలులేక ప్రజలు చాలా ఇబ్బంది పడుతున్నారు. అది పెద్ద నది అవడంచేత, [illegible]నుంచి ఇటు, ఇటునుంచి అటు పోవడానికి చాలా కష్టంగా ఉన్నది. కనుక అక్కడ ఒక్క బ్రిడ్జి కట్టించి ప్రజలకు సౌకర్యము కలుగజేస్తారని ఆశిస్తున్నాను. అధ్యక్షా, చాలా విషయాలు మనవిచేయ దలచాను. అందుచేత, నాకు మరో రెండు నిమిషాలు వ్యవధి ఇవ్వవలెనని కోరుచున్నాను.

తరువాత minor irrigation విషయంలో మా జిల్లాలో చాలా చెరువులు మరమ్మతు లేకుండా ఉంటున్నవి. శ్రీ చంద్రమౌళిగారు ఎస్టేటు మేనేజరు ద్వారాను, ఎస్టేటు తాసిల్దారు ద్వారాను, ఈ చెరువులన్నీ మరమ్మతు చేయించవలెనని కోరుతున్నాను.

తరువాత ఆ ప్రాంతములో ఒక hospital గాని, ఒక మాతా శిశురక్షణశాలగాని లేదు. నేను మొన్న ఎన్నికల సందర్భమున తిరిగేటప్పుడు చూచాను. గొట్టదగ్గర ఒక గ్రామంలో ప్రసవముకాబోయే ఒక స్త్రీని అక్కడ ఏలాటి వైద్యసహాయములేక, శ్రీకాకుళం తీసుకుపోవడానికి ఎన్నో బాధలు పడి నాలుగురోజులకు తీసుకువచ్చారు. అటువంటి పరిస్థితిలో ఒకటి, రెండు శిశుమాతా వైద్యశాలలను ఆ ప్రాంతములో ఏర్పాటు చేయవలసిందని కోరుతున్నాను.

అంతేకాకుండా, ఆ ప్రాంతములో కమ్యూనిస్టు ప్రభువులు ఎక్కువగా ఉన్నారు. ఆఏరియాలో ఉన్నటువంటి కమ్యూనిస్టు నాయకుడు కనీసం రెవిన్యూ మినిస్టరు అవుతానని, అప్పుడు బీదవారికి కనీసం 2, 2½ ఎకరాల భూమి ఇస్తానని గట్టిగా చెప్పాడు. నేను చాలా గ్రామాలు తిరిగి ఇటువంటిది జరగడం చూచాను. అక్కడి ప్రజలు ఈ మాటలు నమ్మి "అయ్యా నాకు 2 ఎకరాల భూమి ఇస్తున్నారు గనుక ఈసారి మాత్రం వారికి వోటు చేస్తాం. ఈ ఒక్కసారి విడిచిపెట్టండి" అని చెప్పారు.

Sri N. Ramulu:—అధ్యక్షా, ఆంధ్ర ప్రజల ఉజ్వల భవిష్యత్తు ఆంధ్రరాష్ట్రావతరణ వెనుకనే అనే సంగతి గ్రహించి, ఆంధ్ర నాయకులు, ఆంధ్ర ప్రజలు చేసిన ఆందోళన ఫలితంగా చివరకు దృఢసంకల్పవ్రతుడైన అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి త్యాగఫలితంగా ఆంధ్రరాష్ట్రం సాధించబడింది. ఈ ఆంధ్రరాష్ట్రం మనకు రానిదే, మన కష్టాలు గట్టెక్కే అవకాశంలేదని అన్ని పార్టీలవారు తలంచినప్పటికినీ, ఆంధ్రరాష్ట్రం సాధించగల మహదవకాశము ఆంధ్ర కాంగ్రెస్ సభ్యులైన అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారికి లభించింది. ఈ విషయం గురించి మన మిత్రులు ప్రతిపక్షంవారు "మేము ప్రభుత్వ పక్షంవారు కాము కాబట్టి మేము చెప్పితే ప్రభుత్వము వినదు కనుక ఆంధ్రరాష్ట్రము సాధారణ పరిస్థితులలో సాధించలేకపోయాము" అని చెప్పుకోవచ్చు. బ్రిటిష్‌వారి హయాములో ప్రతిపక్షముగా ఉండినటువంటి కాంగ్రెస్‌వారు బ్రిటిష్‌వారిని ఈ దేశమునుండి పంపించేటట్లు అహింసా యుద్ధము సాగించారు. అదేవిధంగా ఈనాడు ఆంధ్రరాష్ట్రాన్ని సాధించింది పొట్టి శ్రీరాములుగారు. అటువంటి ఆంధ్రరాష్ట్రంయొక్క ఉజ్వల భవిష్యత్తును నిరూపణచేసి ఆశాజనకంగా ఉండగల అదృష్టము ఆంధ్ర ప్రజానీకానిదే. అటువంటి ఆంధ్రప్రజానీకం మొన్నజరిగిన ఎన్నికలలో వారియొక్క భవిష్యత్తును తీర్చి దిద్దగల నాయకత్వం ఆంధ్ర కాంగ్రెస్‌కే ఉన్నదని నిరూపించడానికి, ప్రజాస్వామ్య విధానంమీద వారికి ఉండే అచంచల విశ్వాసాన్ని ఎన్నికల రూపేణ తెలియజేశారు. అయితే, మన కమ్యూనిస్టు సోదరులు కూడా ఈ రాష్ట్రాన్ని భూతలస్వర్గంగా చేయదలచామని పదే పదే చెప్పినప్పటికిని, ఆంధ్ర ప్రజానీకమే కాదు, [illegible]వత్తు ప్రజానీకం కూడ వారియొక్క మాటలు నిజమని నమ్మలేదని వారు ఈనాటికైనా గ్ర[illegible]. నిజంగా ఈ కమ్యూనిస్టు సోదరులు ఒక నిర్మాణాత్మకమైన కార్యక్రమ మేదైనా పెట్టుకొన్నారా? ఎప్పుడూ ప్రభుత్వాన్ని నిందించడమే వారి కార్యక్రమము. ఎన్నికలలో కాంగ్రెస్‌పార్టీ ఏదేదో తప్పులు చేశారని, అన్యాయం చేశారని నిందించడం తప్ప వారు చెప్పగలిగిందేమిలేదు. వారు చేసిన నిర్మాణాత్మకమైన పనులను చెయ్యెత్తి చూపజాలకపోయారు. మొన్న ఒరిస్సా రాష్ట్రములో పర్లాకిమిడిలో ఆంధ్రులకు, ఒరియా వారికి జరిగిన వివాదము మధ్య అక్కడ ఉన్నటువంటి ఓఢ్రజాతికి చెందిన కమ్యూనిస్టు నాయకుడు ఇక్కడ ఉండే ఆంధ్రులకు అన్యాయం జరుగుతున్నిదని, ఆ అన్యాయాన్ని గుర్తించకుండా ఉన్నారని ఒరిస్సా ప్రభుత్వానికి తెలుపుతూ agitate చేస్తే, ఒరిస్సా ప్రభుత్వము వినకుండా ఉన్నది.

MR. SPEAKER:—వేరే ప్రభుత్వం గురించి సభ్యులు మాట్లాడకూడదు.

SRI N. Ramulu:—ఆంధ్రులయొక్క చిరకాల వాంఛ అయిన ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత యీ శాసనసభా సమావేశము ఆంధ్ర చరిత్రలో ఒక నూతన అధ్యాయముగా ప్రారంభమయింది. ఈ అధ్యాయానికి ఉపోద్ఘాతముగా మొన్నటి దినమున ఆంధ్రరాష్ట్ర గవర్నరు గారు తన వుపన్యాసాన్ని చేశారు. ఈ ఉపన్యాసములో అనేక విప్లవాత్మకమైన, అభివృద్ధికర మైన కార్యకలాపాలనుగురించి గవర్నరుగారు సెలవిచ్చారు. అందులో ప్రథమ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలను గురించి గవర్నరుగారు విపులీకరించారు. ఇప్పుడు రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక గ్రామ సౌభాగ్యానికి పునాదిగా వుంటుంది. గ్రామసీమలు ఏనాడైతే సౌభాగ్యవంతముగా వుంటాయో ఆనాడే దేశ సౌభాగ్యము కాగలదనే నగ్నసత్యాన్నిగుర్తించి కేంద్ర ప్రభుత్వమువారు యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను తయారుచేయించి ప్రవేశపెట్టబోతున్నారు. మా శ్రీకాకుళం జిల్లాకు సంబంధించిన వంశధార ప్రాజెక్టు విషయము గవర్నరుగారి వుపన్యాసములో పేర్కొన బడ్డది. ఈ వంశధార ప్రాజెక్టును యిప్పటికి నూరుసంవత్సరాలుగా అక్కడి ప్రజలు ఎంత కష్టపడినను సాధించలేక పొయ్యారు. అటువంటి యీ వంశధార ప్రాజెక్టును కట్టడానికి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిందని గవర్నరుగారు తన ఉపన్యాసములో చెప్పినందుకు నేను వారిని అభినందిస్తున్నాను. ఇప్పుడు యీ వంశధార ప్రాజెక్టుకుగాను స్థల నిర్ణయమును గురించి ఎటువంటివైనా బేధాభిప్రాయాలు వచ్చినను, యీ ప్రాజెక్టును మరికొంత కాలానికి వెనుకకు నెట్టివేయకుండా, సత్వరంగా అమలులోనికి వచ్చే ప్రయత్నము ప్రభుత్వము వారు చెయ్యాలని నేను కోరుతున్నాను.

మరొక విషయం ఉన్నది. ఈనాడు ప్రభుత్వమువారు ఎన్నో గృహనిర్మాణ సంఘాలను ఏర్పాటు చేశారు. ఈ సంఘాలు రెండు రకాలుగా వున్నవి. అందులో మొదటిది colonization scheme, రెండవది ఎవరంతట వారే యిండ్లుకట్టుకునే స్కీము, ఈ రెండూ వున్నవి. ఈ రెండు స్కీములలోను, మొదటిస్కీము క్రింద ప్రజలకు 5 వేలనుండి 15 వేల రూపాయలవరకు 20 సంవత్సరములలో తీర్చుకునటానికి వీలుగా అప్పు లివ్వటానికి ప్రభుత్వము సంకల్పించింది. కాని యిటువంటి స్కీము భాగ్యవంతులకు తప్ప, పేద ప్రజలకు ఉపయోగపడదు. ఈ స్కీము పేద ప్రజలకుగూడా వుపయోగపడేటట్లుగా చేయాలంటే యీ అప్పు 5 వేలనుండి కాకుండా, వెయ్యి రూపాయలనుంచే మొదలుపెట్టియిస్తే, చాలామంది పేదప్రజలుగూడా అప్పుతీసుకొని గృహ నిర్మాణము చేసుకోటానికి అవకాశముంటుందని మనవి చేస్తున్నాను.

Minor and major irrigation schemes ను గురించి చెప్పాలంటే, మా శ్రీకాకుళం జిల్లా రాష్ట్రములోని జిల్లాలన్నిటిలోకి గూడా చాలా వెనుకబడి యున్నది. ఈ జిల్లా, ఆర్థికంగా వెనుకబడి యుండడమేగాకుండా, రాష్ట్రానికి ఒక మూలగాను, చిట్టచివరగాను వున్నది. మాజిల్లాలో ఇంతవరకు minor irrigation schemesగాని major irrigation schemes గాని, ఒకటిగూడా అమలులోకి రావటానికి, మా జిల్లాయుంతయు జమీందారీ ప్రాంతమైయున్నందున, వాటికి అవకాశము కాకపోయింది. ఇప్పుడు ప్రభుత్వమువారు యీజమీందారీలను స్వాధీనపరచుకున్నారు కాబట్టి యికమీదటనైనను యీ major and minor irrigation schemes ల క్రింద

రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కేటాయించబడిన పదికోట్లరూపాయలకుగాను, యితరజిల్లా లలోకన్న, ముఖ్యంగా మాజిల్లాలోనే హెచ్చు ఖర్చు చేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఈ నాడు దేశములో లేబరు సమస్య చాలా తీవ్రంగాను, విషమముగాను వుంటున్నది. ఈ మధ్య దేశములోని unemployment problem solve చేయడానికి ఒక వెయ్యి single teacher schools ను విద్యావంతులకు వృత్తికల్పించు నిమిత్తం ప్రత్యేకంగా open చేశారు. అయితే విద్యలేనివారుగూడా దేశంలో చాలామంది నిరుద్యోగులుగాంటు వున్నారు. ప్రభుత్వమువారు వీరికి ఏ విధంగా unemployment solve చేస్తున్నారో తెలియలేదు. ఇందుకు నేనొక సలహా ఇస్తున్నాను. Co-operative schemes క్రింద వీరందరికి గూడా సదుపాయాలు చేయవచ్చు. ఉదాహరణకు ఈనాడు దేశంలో rickshaw wallas ఎంతోమంది వుంటున్నారు. Rickshaws ను నడిపేవారు ఈనాడు స్వంతదార్లకు బాడుగ దినదినము చెల్లించుకుంటూ జీవించుచున్నారు. గృహ నిర్మాణ విషయంలో ఇరవై ఏండ్లలో తీర్చుకుని ఇండ్లకు స్వంత హక్కును కలుగజేసుకునేమాదిరిగా, యీ rickshaw wallas కుగూడా ఒకసంఘము ఏర్పాటుచేసి, కోఆపరేటివ్ సొసైటీలద్వారా అప్పులు ఇచ్చి, యజమానులకు చెల్లించే బాడుగ సొసైటీలకు కట్టించే ఏర్పాటుచేసి, వారికి ఈ rickshaws మీదకూడా కొంతకాలానికి స్వంతముగా హక్కు ఏర్పరచుకునే అవకాశంకల్పిస్తే బాగుం టుందని నా అభిప్రాయము. ప్రభుత్వమువారు ఆవిధంగా యీ విద్యరానివాళ్ళకు సహాయముచేస్తారని ఆశిస్తున్నాను.

ఇక మనదేశములో కొన్నిచోట్ల అధికంగా వర్షములు కురవడమువల్ల ఒక విధంగాను, మరికొన్ని చోట్ల అసలే వర్షములు లేకపోవడమువల్ల ఇంకొక విధంగాను పంటలు లేకపోవడము జరుగుచున్నవి. ఈనాడు విదేశాలలో పంటలకు భీమా పద్ధతి ఒకటి అమలులో వున్నది. ఆ పద్ధతి మనదేశములో గూడా పెట్టితే రైతులకు సౌకర్యములు కలుగజేయడానికి వీలుంటుంది. ఈ పద్ధతి అమలులో వుంటే, వ్యవసాయము వారు ఎంతో వుత్సాహకరంగా చెయ్యగలుగుతారు. ప్రభుత్వమువారు యీ భీమా పద్ధతి మనదేశములో గూడా ప్రవేశపెటు తారని ఆశిస్తూ, గవర్నరుగారి ఉపన్యాసముమీద తేబడిన అభినందన తీర్మానమును బలపరుస్తూ, గవర్నరుగారిని అభినందిస్తూ విరమిస్తున్నాను.

MR. SPEAKER:—The House will now adjourn and meet again tomorrow at 10 A.M.

The House then adjourned.